# సదభిప్రాయములు.

**Karna Vikramam:**—This is an original Telugu Drama in five acts, written in a lucid literrary style. The author spared no pains to make his drama successful on the stage. The various characters are fully given their due. The book is highly commendable for specialistic characterisation and independent thinking.

(1917—1918) *Humanity.*

# విజయవిజయము లేక కర్ణవిక్రమము.

"ఇందుకర్ణుని పరాక్రమాదులు చక్కఁగ వర్ణింపఁబడినవి. కవిత్వము శైలి రసవంతముగను మనోహరముగ నున్నది. సందర్భమునకుఁ దగినటుల రసపోషణము చక్కఁగఁ జేయఁబడినది."

(1917—1918) దేశాభిమాని.

శ్రీయుత రాళ్లపల్లి అనంతకృష్ణమాచార్యులుగారు.

కర్ణవిక్రమము లేక (విజయవిజయము)

ఈనాటకమున సొగసయిన పద్యముల నేకములు గలవు. శైలి నిరర్గళము. యతిప్రాసల తొడకులేదు. చూడుడు.:—

చం. పరుగిడి పొమ్ము బెండువడి, పౌరుషముండిన లాభమున్నె? భూ
సురునకు నీవు చాలుదువె? జోదులు మొందుగఁ గూలిరా కళే
బరములఁద్రుంచి తృప్తిగన వచ్చును ప్రాణసఖులున్నఁ; బోరినన్
మరణము సంభవించు; నభిమానముతోఁ బనియేమి భీరువా?"

(1917—1918) గ్రంథాలయసర్వస్వము.

పాత్రలు:—

1. శ్రీకృష్ణుడు.
2. అర్జునుడు.
3. కర్ణుడు.
4. శల్యుడు.
5. ధర్మరాజు.
6. [illegible]
7. భీముడు.
8. దుశ్శాసనుడు
9. దృష్టద్యుమ్నుడు.
10. అశ్వత్థామ.
11. కృపాచార్యులు.
12. సత్యసేనుడు.
13. వృషసేనుడు.
14. శకుని.
15. క్షేమధూర్తి.

మరికొన్ని పాత్రలు సందర్భానుసారముగ వత్తురు.

# కర్ణవిక్రమము—విమర్శనము.

1916—1917 సం॥ ఛత్రపురాంధ్రసమాజ వార్షికోత్సవము నాడు బ్ర॥ శ్రీ॥ మండపాక పార్వతీశ్వరశాస్త్రి, బి. ఏ. గారు దివిన విమర్శనము:—

శ్రీమచ్ఛత్రపురాంధ్ర భాషాభివర్ధనీసమాజ వార్షికోత్సవ సందర్భమున బ్రహ్మశ్రీ భాగవతుల నృసింహశర్మగారిచే నూతనముగ విరచింపఁబడిన కర్ణవిక్రమమను నాటక విమర్శనకార్యము నాపైఁబెట్టినందుకు సమాజమువారికి నేను రెండువిధములఁ గృతజ్ఞుఁడనై యున్నాను. ఈసమాజము స్థాపించి యారు వత్సరములైనది. స్థాపనోద్దేశము భాషాభివర్ధనము. భాషాభివర్ధనమునకు గ్రంథపఠన మెంతయావశ్యకమో, గ్రంథకర్తలకుఁ బ్రోత్సాహమొసంగుటయు నంతయావశ్యకము. అట్టియావశ్యకధర్మనిర్వహణము ఆరుసంవత్సరములైనను, సమాజము గ్రహింప కలిగినదిగదాయని నాకానందమైనది. సుమారు నూర్వురుసభ్యులుగల యీసమాజమున గ్రంథవిమర్శన కార్యమునకు నన్నొకని పెద్దఁజేసి నాకు గౌరవము గలిగించినందున సమాజమువారికి నేను కృతజ్ఞుఁడనై యుండుటకిది మొదటికారణము. ఇఁకనన్ను విమర్శనము వ్రాయుమన్న గ్రంథము నాకుఁ జిరపరిచయులగు బ్ర॥ శ్రీ భాగవతుల నృసింహశర్మగారిచే వ్రాయఁబడినదగుటచే నది నాకృతజ్ఞతకు రెండవకారణము. ఈవిమర్శనమునఁగల లోపముల శ్రీ శర్మగారును సమాజమువారును గూడ క్షమింతురనియెంచి విమర్శనమును ప్రారంభించుచున్నాను.

కర్ణవిక్రమమను పేరుగల యీ గ్రంథము 5 అంకముల దృశ్యకావ్యము. ప్రాచీన లక్షణానుసారముగ వ్రాయఁబడిన దృశ్యకావ్యములకును, నర్వాచీన లక్షణానుసారముగ వ్రాయఁబడినవారికిఁ జాలభేదముగలదు. ఈ కాలమునఁ గొన్ని దృశ్యకావ్యములు ప్రాచీన లక్షణానుసారముగను, కొన్ని యర్వాచీన లక్షణానుసారముగను వ్రాయఁబడుచున్నవి. కొన్నిటిలోఁ బ్రాచీనలక్షణములు కొన్నియు, నర్వాచీన లక్షణములు కొన్నియుఁ గనఁబడుచున్నవి. వీనిని మిశ్రలక్షణములని చెప్పవచ్చును. "ప్రస్తావమున నున్న కర్ణవిక్రమనాటకమే లక్షణముల ననుసరించి వ్రాయబడిన" దను సంశయము మొదట చర్చింపవలసియున్నది. సుప్రసిద్ధులగు విశ్వనాథ పంచాననులవారు తమసాహిత్యదర్పణమున నాటక లక్షణముల నిట్లు వ్రాసిరి. "నాటకంఖ్యాత వృత్తంస్యాత్ పంచసంధి సమన్వితమ్. విలాసర్ద్ధ్యాది

# కర్ణకీయము—విమర్శనము.

గుణవద్యుక్తం నానావిభూతిభిః, సుఖదుఃఖసముద్భూతి ర్నానారస నిరంతరమ్
పంచాదికాదశ పరాస్తత్రాంకాః పరికీర్తితాః॥

ప్రఖ్యాత వంశో రాజర్షి ర్ధీరోదాత్తః ప్రతాపవాన్। దివ్యోథదివ్యాదివ్యోవాగుణవాన్ నాయకో మతః। ఏకఏవ భవదఙ్గీ శృంగారో వీరఏవవా। అంగమన్యేరసాః సర్వేకార్యం నిర్వాహణేద్భుతమ్। చత్వారః పంచవా ముఖ్యాః కార్యవ్యాపృత పూరుషాః॥"

ఇందుముఖ్యాంశము లేవన:—

1 నాటకవృత్తము ప్రఖ్యాతమైయుండవలెను.

2 5కు, తక్కువ కాక, 10కి, ఎక్కువ కాక, యంకము లుండవలెను.

3 నాయకుఁడు ప్రఖ్యాతవంశ సముద్భూతుఁడును, రాజర్షియును, ధీరోదాత్తుఁడును, ప్రతాపవంతుఁడును, దివ్యుఁడైనను లేక దివ్యాదివ్యుఁడయినను, గుణవంతుఁడును నైయుండవలెను.

4 శృంగారవీరరసముల నేదోయొకరసము ప్రధానముగను, తక్కినరసము లంగములుగాను నుండవలెను.

5 కార్యనిర్వహణ మద్భుతమైయుండవలెను.

6 కార్యనిర్వాహకులలో ప్రధానులు నలుగురైదుగురు మాత్రమే యుండవలెను. ఈనాటకమున నీపై యారులక్షణము లుఁ గనుపట్టుచున్నవి. నాటకవృత్తము సుప్రసిద్ధమైన మహాభారతమునందలిది. ఇది యైదంకములుగా భాగింపఁబడినది. నాయకుఁడు ప్రఖ్యాతచంద్రవంశ సంభూతుఁడును, భక్తాగ్రేసరుఁడును, ధీరోదాత్తుఁడును, ప్రతాపవంతుఁడును, దివ్యాదివ్యుఁడును, గుణ

వంతుడునగు నర్జునుఁడు. ఇందు వీరరసము ప్రధానము. క్రోధ బీభత్సహాస్య కరుణాది రసములంగములు. కార్యనిర్వహణ మత్య ద్భుతమగు కర్ణసంహారము. కార్యనిర్వాహకులలో కర్ణశల్య కృష్ణార్జునులు ప్రధానులు. ఈపై కారణములఁబట్టి యిది గీర్వాణ నాటక సంప్రదాయాను సారముగ వ్రాయబడినదని తలఁప వచ్చును. కాని కొన్ని గీర్వాణనాటక లక్షణము లుల్లంఘింపఁ బడినవి. నాటకసంధులన్నియు సమముగా ననుసరింపలేదు.

"దూరాహ్వానం వధోయుద్ధం రాజ్యదేశాదివిప్లవః। వివాహోభోజనమ్ శాపోత్సర్గామృత్యూరతమ్॥ తథాదంతచ్ఛేద్యం నఖచ్ఛేద్యో మన్యద్రీడాకరం చయత్। శయనాధరపానాది నగరాద్యవరోధనమ్। స్నానానులేపనేచైభిర్వర్జితః," అనిగీర్వాణనాటకలక్షణము. వర్జింపబడవలసినదని యిందునిర్ణయింపబడిన యంశములన్నియు వర్జింపఁబడి యున్నవిగాని, వధయును యుద్ధమును మాత్రమే ప్రదర్శింపఁబడినవి. మఱియు నిందుపాశ్చాత్యనాటక లక్షణమెంతవఱ కనుస రింపబడినదో చూతము. ఇందు విజయవిజయముకన్న కర్ణసంహారమునకే యధిక ప్రాముఖ్య మొసంగఁబడియున్నది. కావున నిది "Tragedies'? విషాదాంత నాటకములలోఁ జేరుచున్నదని చెప్పుటయే సమంజసము.

గీర్వాణనాటకములలో విసర్జింపబడి పాశ్చాత్య నాటకములలోఁ బ్రదర్శింపఁబడుచున్న వధయును యుద్ధమును నిందుఁజేర్పఁబడినవి. ప్రాచీన నాటకలక్షణముల లోపాలోపములను చర్చించుటకు మన కధికారము కలదో లేదో—నేఁజెప్పలేనుగాని కేవల వీరరసప్రధానమగు నాటకమున యుద్ధమును వధయుఁ బ్రదర్శింపకపోవుట యేమి సమంజసముగా నుండునో నాకుఁదెలియ కున్నది. ఈరెండును ప్రదర్శింపవలసినప్పుడు ప్రాచీన నాటకకర్తలు గంధర్వ దంపతులను దెచ్చిపెట్టి వారిచే వర్ణింపించుచున్నారు. ఇట్లువర్ణించుట శ్రవ్య కావ్యము చేయవలసినపనిగాని దృశ్యకావ్యము చేయవలసినపనిగాదు. దృశ్య కావ్యము వ్రాయుచు దానికి ప్రధానమయిన యంశమును విడచివేయుట నేల

విభజించి పాఠముచేయుటవంటివి. కావుననే యధునాతననాటక కర్తలీ నియమంబుల నుల్లంఘించి పాశ్చాత్య లక్షణము ననుసరించుచున్నారు. ప్రాచీననాటక లక్షణముల స్థలవిభజన నియమము సమంజసముగాలేదు. కావున సుప్రసిద్ధులగు వేదము వేంకటరాయశాస్త్రిగారు, ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారు మొదలగు నాటకకర్తలు పాశ్చాత్యనాటకలక్షణముల ననుసరించియే, స్థలవిభజనముం జేసియున్నారు. శ్రీశర్మగారును వారిననుసరించియే స్థలవిభజనముం జేసియున్నారు. పాశ్చాత్యలక్షణానుసారముగా స్థలవిభజనము చేయుటచే నాటకసంధుల యావశ్యకము లేకపోవుటచే నా సంధి నియమములను పాటింపకపోవుట సమంజసముగానే యున్నది. పైయంశము లన్నియు సమన్వయించిచూచినచో విజయవిజయ మాంధ్రభాషలో నిదివరకే సుప్రసిద్ధములై యున్న చిత్రనళీయ ప్రతాపరుద్రీయాది నాటకముల ననుసరించి ప్రాక్పశ్చిమసుప్రశస్త నాటకలక్షణసమ్మేళనమున వ్రాయబడినదని నాయుద్దేశము. ఇంక కథావిమర్శనమునకుం బోవుదము. సుప్రసిద్ధమగు భారతేతిహాసముంగూర్చిగాని భారతయోధులం గూర్చిగాని యిందుం జర్చించుట చర్వితచర్వణము. విషాదాంతమని చెప్పుటయే సమంజసముగా నున్నదని యిదివఱకే వ్రాసియున్నాను. కావున విషాదాంతవృత్త మెట్లుండవలెనో కొంచెము తెలుసుకొనవలెను. ఆంధ్రభాషలో విషాదాంతనాటకము లిప్పుడిప్పుడే తలచూపుచున్నవి. కాని విషాదాంతవృత్తమన నేమియో కొందరికింకను బొత్తిగా బోధపడినట్లు కన్పడదు. చావుతో నంతమయినంతమాత్రమున విషాదాంతమేయని వాదించుచున్నారు. అదియొకపొరపాటు. చావుతో నంతమయినంతమాత్రమున నది విషాదాంతవృత్తము కానేరదు. మృతి యొక ప్రధానాంశము కూడ కాదు.

The failure—at least the worldy failure of those from, whom much might have been expected, who ought to have attained, but somehow have not; the nonfulfilment or ruin of high possibilities of character and natural endowment." అని పాశ్చాత్య లక్షణకారులు వ్రాసియున్నారు. షేక్స్పియరు యొకానొకమహానుభావుడు ప్రకృతివలన తనకుం గలిగిన

# కర్ణవిక్రమము—విమర్శనము.

మహోగ్రసంపత్తిచేఁ జేయుటకు సామర్థ్యముఁగలిగియున్న యొకమహాకార్యమునఁ గారణాంతరములచే నిర్వర్తింపలేకపోయినచో నది విషాదాంతమని చెప్పఁబడును. ఈలక్షణమునకుఁ గర్ణుఁడు సుప్రసిద్ధుఁడైయున్నాడు. ఆమహానుభావుఁడు సూర్యవరప్రసాద జనితుఁడు. సహజకవచకుండల విరాజమానుఁడు. పరశురాముని శిష్యులలో నగ్రేసరుఁడు. ఇట్టివాఁడుచేయవలసిన మహాకార్యము పార్థసంహారము. కాని యీమహాకార్యమునకు దైవిక మానుషికములయిన యంతరాయములెన్నో కలిగినవి. ఈయంశముఁగూర్చి కర్ణుఁడే తన యవసాన కాలమున నర్జునునితో నిట్లనుచున్నాడు.

సీ. కపటభూసురవేష గాత్రుఁడై దేవతా ధ్యక్షుండు......109 పుట

కావున కర్ణునియశస్సుఁ బఱకెంప మిక్కిలి బలశాలియైన యొకవీరుఁడు మిక్కిలి వేగముగాఁ బ్రవహించుచున్న యొకప్రవాహమునకు విధివశమున నెదురీదవలసివచ్చినప్పుడు వానిప్రయత్నమెట్లువ్యర్థమగునో యట్లే కర్ణుని పరాక్రమమంతయును వ్యర్థమయినది. దానికిఁ గారణము కర్ణునిపరాక్రమమునకుఁ దోడు కర్ణుని యందుఁగల సుగుణదుర్గుణముల సమీకరణమే కావున, కర్ణుని గుణలోపములను మనముభేదించి చూడవలెను.

మొట్టమొదట కర్ణుని సుగుణములఁగూర్చి యాలోచింతము.

1 కర్ణునియౌదార్యము. ( ఈయంశముఁగవి యీక్రింది విధమునఁ జూపియున్నాఁడు )

తనకుఁజేఁజిక్కిన పాండవ యోధవర్యుఁడగు ధృష్టద్యుమ్నునిఁగరుణించి

కం. "పిడిచితిఁ గరుణించితిఁగ
వ్వడితోఁగల చొప్పుచెప్పి వానిన్ వెన్నన్

పడి వెన్నొసఁగ దెప్డు
బలము చూపెద మగటిమియును పోటుఁదనంబున్.

చేఁజిక్కినవీరవరునిఁ జంపుట వీరధర్మముగాదని కృష్ణార్జునులతోఁ బోరునప్పుడు తన పరాక్రమముఁ జూడవచ్చుననియుఁ జెప్పి విడిచిపెట్టియున్నాఁడు.

2 కర్ణుని స్నేహభావము:—

ఒకానొకసమయమున శ్రీకృష్ణుఁడు కర్ణునితో నిట్లుచెప్పియున్నాడు.

చం. తెలిపితినీకుఁదమ్ములకు దీరని వైరము కీడటంచు నా.........25 పుట

దానికి కర్ణుఁడిట్లు జబాబుచెప్పియున్నాఁడు.

చం. "గెలుపునుబొందలేనియెడఁ గీడ్పడిచచ్చెదఁగాక వైరితో......27 పుట

తనయైశ్వర్యమునకంతటికిఁ గారణభూతుఁడైన దుర్యోధనునకుఁ దానుప్రాణములైన నీయవలసియున్నవనియు, దుర్యోధనునకు శత్రువగుటచే నర్జునుఁడు తనకును శత్రువే యనియుఁ దుచ్ఛమగురాజ్యమున కాసపడి శత్రుపక్షముఁ జేరుటకన్న మృత్యువే మేలనియు దీనివలన సూచింపబడుచున్నది. కర్ణునకు దుర్యోధనునందుఁగల స్నేహభావమెంతయు సమంజసమైయున్నది.

3. కర్ణుని నిష్కామకర్మయోగము:—

కీడువచ్చునని గ్రహించియు, నగ్నిహోత్రమునఁబడుట పాడిగాదని తనకు దుర్బోధచేయుచున్న శల్యునితో—

చం. "మునుమనుజుండుకార్యపల మున్ వచియించగరాదు; లెస్సయై...57 పుట

చెప్పియున్నాఁడు. యుద్ధమునందలి ధర్మాధర్మములతోఁ గాని జయాపజయంబులతోఁగాని కర్ణునకుఁ బ్రసక్తి లేదు. అది రాజుగారిపని. తాను సేవకుఁడు

గావున, సేవకునివిధి రాజాజ్ఞాచరణము కావున దోషరహితముగా స్వధర్మము చేయుట యుత్తమమని కర్ణుఁడాలోచించి యారీతినే యాచరించెను. నిష్కామ కర్మమున కింతకన్న నేమికావలెను. కర్ణునియందిట్టి సుగుణములు పెక్కులున్నను గొప్పలోపములుఁ గొన్నియున్నవి:—

1 తనప్రతాపమును తానే విస్తారముగా వర్ణించుకొనుట. తన్నుదాను వర్ణించుకొనుట యెప్పుడును నిందాస్పదమే. అయినను నొక్కొక్కప్పుడు విధిలేని సమయమున నితరులకుఁ తనకుగలసామర్థ్యమునందు విశ్వాసముఁ గలిగించుటకై యించుక నొక్కిచెప్పవలసియుండును. వీరు లందఱు నొక్కొక్కప్పుడట్లు చేయు చుందురు.

ఒకసమయమున భీష్ముఁడిట్లు కర్ణునితోఁజెప్పినట్లు తిక్కన వ్రాసియున్నాఁడు.

చం. ముదుకడనైననాదుబల మున్ జలమున్ వివిధాస్త్రశస్త్ర సం
పదయునుబోయి నీగురువు భార్గవుచేత నెఱింగికొమ్మ; నా
కెదిరినవారు పెక్కుడల నేమయిపోయెఱుఁగుంజగమ్ము; నా
ముదిమియు నీకుమాఱుతనమున్ వరుసన్ విజయుండెఱింగెడున్.

కర్ణుఁడో మాటిమాటికిని, తనప్రతాపము నవసరమయినప్పుడు కాని యప్పుడు వర్ణించుకొనుచుండెను. ఉదాహరణము చూడుడు.

ఉ. లగ్నముఁబెట్టినాఁడ జయలక్ష్మినిబెండిలియాడ, నాదుబా......47 పుట

అని యొకసారియు

గీ. వైరివీరప్రకాండ గంభీరజలద.........48 పుట

అనియింకొకసారియు, మఱియు నిట్లెన్నోసారులు వర్ణించుకొనుచుండెను. మోతాదుమించిన మందు గావున నిది యున్మాదకారణమే యగుచుండెను.

2. రెండవది యతిశీఘ్రముగఁ గ్రోధావిష్టుఁడగుట. కర్ణున కెల్లప్పుడు ముక్కుపైఁగోపముండును. చీమచిటుక్కుమనిన నది పైకి వచ్చుచుండును. శల్యుని వలనఁదనకు గొప్ప యుపకారము కావలసియున్నది. శల్యుఁడు తన్ను మాటిమాటికి

కేవల సాహసమును మాత్రము వాస్తవమే కాని కార్యసాధకుఁడే యైయున్నచో కర్ణుఁ డిట్టి సంభాషణలచే బుజ్జగించవలసియుండెడి దనయహంభావమును విడువక:—

మ. పతిలేఁడో స్వర్గసంస్థితుండో మద్యంబుజాయి తాగ్రి...59 పుట

అని వానికైనం గోపించి మఱలఁ దనప్రతాపము నిట్లువర్ణించియున్నాఁడు.

సీ. దంతకుంభస్థలంబై నిభుజ దండములాక్రమించి దివ్య కో......59 పుట

3 కర్ణుని మూడవ లోపము మితిమీఱిన యాత్మవిశ్వాసము—

ఆత్మవిశ్వాసము మనుష్యున కావశ్యకమే. ఏగొప్పకార్యమయినను తాను చేయలేనని యనుకొన్నంతకాలము చేయలేడు. చేయఁగలనను దృఢవిశ్వాసముతో పూనుకొన్నచో యత్నించి చేయఁగలఁడు. కాని యీవిషయమున వివేకము మాత్రము కలిగియుండవలెను. అభినవభీమసేనులఁగు కోడి రామమూర్తిగారు సహితము మోటారుబండి నిలాగుటకు సామర్థ్య మున్నంతమాత్రమున నెంత యాత్మవిశ్వాసమున్నను హిమవత్పర్వతముఁ బెకలించి పాఱవేయఁగలరా? కాబట్టి తానేపనిచేయుటకుఁ దలంచినను మనుష్యుఁడు మొట్టమొదట తనబలమెంత, యెదిరిబలమెంత, తాను చేయవలసిన కార్యభారమెంత యనుసంగతి నిర్ధారణగా తెలుసుకొనక తమ్ము ప్రయత్నములు చేసినచో కొనసాగనేరదు. అర్జునునిఁ జంపుటకై కర్ణుఁడు సహజ కవచ కుండలములతోఁ బుట్టినాఁడు. అది యింద్రుఁ డెత్తుకొనిపోయినాఁడు. అర్జునునిఁ జంపుటకయి యింద్రుఁడొక శక్తి నిచ్చియున్నాఁడు. అది ఘటోత్కచునిపై వ్యర్థమయినది. అర్జునుఁజంపఁగల నాగాస్త్ర మొకటి తనయొద్దనున్నది. అది యర్జునుని కిరీటమెత్తుకొని పోవుటలో వ్యర్థమైనది. ప్రవదివ్యాయుధములన్నియు నిట్లువ్యర్థమయినను, పార్థుని నాను జంపఁగలననియే చిట్టచివరవఱకు కర్ణుఁడు నమ్మియున్నాఁడు. చూడుడు.

గీ. రథముకుగ్రింగిన నేమి! యా యుధములేక.........110 పుట

అని రథముగ్రుంకినను కర్ణుఁడు పలికియేయున్నాఁడు. ఇట్టి మితిమీఱిన యాత్మవిశ్వాసము నెపోలియన్ మొదలగు మహాశూరులలోఁగూడ చిట్టచివఱకుఁ గనుపడుచున్నది కాని యది వారి వినాశనమునకే కారణమయినది. కర్ణునియందట్టి

లోపము లనేకములున్నవి. కావుననే భీష్మద్రోణశల్య కృపాశ్వత్థామాది భారతవీరులందఱికి నాతనిపై నసూయ జనించినది. దీనికంతకుఁ దోడు—అతని కులము. సుప్రసిద్ధమయిన క్షత్రియకులమున జనించియు నాతఁడు సూతకులసంభూతుఁడైనట్లు లోకమునకుఁ గన్పట్టుట. ఇది కర్ణునిలోపము కాదు. కుంతీదేవిది. ఈలోప మెవరిదయినను భారతకథయంతయు గానిలోనే యున్నది. ఆరహస్యము కర్ణునకు, భీష్మునకుఁ గృష్ణునకుఁదప్ప మఱియెవరికిఁ దెలియదు. కావుననే కర్ణునిలోడిదే భారతమైనది. ధర్మరాజున కీసంగతి తెలియకపోయినను, నంతరాత్మ మాత్రమాతని వేధించుచునేయుండెను. కర్ణునియవసానసమయమున "కృష్ణా! కర్ణుని గతించి నందులకు సంతోషమునకు మాఱు దుఃఖముప్పొంగుచున్నదని విచారింప, శ్రీకృష్ణుఁడు ప్రసంగాంతరమున దానిఁ జఱపించెను. పైరన్ధ్రయంతయును సమన్వయించినచో, కర్ణునియౌదార్యస్వభావమంతయును గనుపట్టును. మంత్రప్రభావమున సూర్యునియనుగ్రహమున, సహజకవచకుండల విరాజితుఁడై జన్మించినవాఁడును, మహాస్త్రశస్త్ర విదుఁడు నగు కర్ణుఁడన్నివిధముల నర్జునుని జంపఁదగినవాఁడు. ఆసంగతి తెలిసి కర్ణునిమిత్రునిగాఁ జేసికొని యతనివలన భారతయుద్ధమున గెలుపొందుటకు దుర్యోధనునకు సంపూర్ణవిశ్వాసము కలదు. దానినాతఁడు మాటిమాటికిని వెలిబుచ్చుచునే యుండెను. చూడుఁడు—

చం. నరుఁడనినన్ మహోగ్రుఁడగు నాకుఁ బ్రియంబు ఘటింపుచుండు నం...88 పుట

కర్ణుని సామర్థ్యమునకును, దుర్యోధనుని విశ్వాసమునకును, కర్ణుని గుణాగుణములే భంగము గల్గించెను. కర్ణునియందు సుగుణములు మూఁడు. ఔదార్యము స్నేహము. నిష్కామకర్మము. ఇవియన్నియు మితిమీఱినవి. ఔదార్యము మితిమీఱుటచేఁ గవచకుండలము లింద్రుఁడపహరించెను. స్నేహము మితిమీఱుటచే, బాంధవ్యమసహ్యమయ్యెను నిష్కామము మితిమీఱుటచే స్వోజ్జృంభణమే మఱచిపోయెను. ఇఁక కర్ణునియందు మూఁడు ముఖ్యలోపములు గలవు. తనప్రతాపముఁ దానే వర్ణించుకొనుట. దీనివలన నశ్వత్థామాదులతో శత్రుత్వము కలిగెను 2 శీఘ్రముగఁ గ్రోధావిష్టుఁడగుట. దీనివలన భీష్మద్రోణాది మహావీరులతో వైరము సంభవించెను. 3 అత్యధికమయిన యాత్మవిశ్వాసము. దీనివలన భగవదంశ సంభూతుఁడగు శ్రీకృష్ణుని సహాయముగల యర్జునుని సామర్థ్యము గ్రహింపలేకపోయెను.

# కర్ణవిక్రమము—విమర్శనము.

నైలోపములఁబట్టి కర్ణునిబలము క్రమక్రమముగ క్షీణించినది. కర్ణునియంతిమ వాక్యములు విన్నచో నెట్టిగాయిమైనను కరుణపోషకమానదు ఈ. నాటకము సంగల 118 వ పుట పద్యములఁబఠించిచోఁ దెలియును. కావున కర్ణునివృత్తము విషాదాంతమై యున్నది. ఆంధ్రభాషలో నాటకములు వ్రాసినవారెవ్వరును, కర్ణుని గుణాగుణములు లెస్సగ గ్రహించి కర్ణపాత్రనుచిత్రించినట్లు కన్పట్టదు. ఒక్కొక్కరొక్క దుర్గుణముఁబట్టి చిత్రించుకొనిపోయిరిగాని యన్నియును సమన్వయించి చిత్రించిన గ్రంథ మిదియొక్కటియే మాకుగోచరించుచున్నది. పాత్రపోషణమును విడచి యితరాంశములఁ గొన్ని చర్చించెదము. నాటకాముఖమున వ్రాయఁబడిన రెండుపద్యములు ప్రశంసార్హములు.

ఉ. శ్రీరమణీమణీవిభుని చెయ్యుర్లలకుందగు నూతకోలయై.........1వ పుట

ఇందు "భారతకర్ణపర్వ కవితారసధారలు', అనుచో వ్యంగ్యము సమంజసము. భారతమునందలి విన నింపైన కవిత్వమును మీరు విని యానందింతురుగాక. యని యొకయర్థమును, కాంతియందాసక్తిగలనేను ప్రదర్శింపఁబోయెడు కర్ణపర్వమనురూపకమునందలి కవితారసమునకు మీ రానందింతురుగాక యనియు నర్థము.

సీ. క్షాంతినిశ్చలమున సర్వంబుభరియించి etc. .........1వ పుట

ఇందు కర్ణునిజన్మమువలనఁ గలిగిన సామర్థ్యమును పరశురామునివలనఁ గలిగిన విద్యాలాభమును, వానిమూఁడుసుగుణములు మూఁడుదుర్గుణములును గలిసి యెనిమిది విశేషములు తెలియఁజేయఁబడుచున్నవి. ఇది కేవలవీరరసప్రధాన మగుటచేఁ గవిత్వము గాక వృత్తియే ప్రధానముగాఁ జేసుకొనఁబడినది.

ఈ గ్రంథకర్తకు నితరవృత్తములకన్న శార్దూలమత్తేభము లెక్కువ సౌలభ్యముతో రచియింపఁగల సామర్థ్యమున్నట్లు కన్పట్టుచున్నది.

ఈ క్రిందిపద్యములు ప్రశంసార్హములు.

శా. క్రీడింపల్పుట నాకసత్యమనుచుఁబో కీడ్పాటువాటిల్లుఁబో......50 పుట

| | |
|---|---|
| మ. తనివోఁ జెందితి భోగభాగ్యముల మిత్రద్రోహమున్............ | 43—44 పుటలు |
| మ. నరిసేయందగునొక్క నూతకులసంజాతుండను... ............ | |
| మ. కలిమింగోరి చరించుప్రాయమునఁడు స్వర్గప్రాప్తికిన్ దవ్వగున్... | |

## కర్ణవిక్రమము—విసర్జనము.

ఇంకను నీ గ్రంథమునందుఁ జూపవలసిన విశేషములున్నవిగాని గ్రంథ విస్తరభీతిచే నిప్పుడు విరమించెదను.

## ఉపసంహారము.

పాత్రపోషణమునందును, ధారాశుద్ధియందును కొఱఁతలేని యిట్టి నూతనరూపకమును వ్రాసినకవియు దానిని విమర్శించిన సమాజమువారుగూడఁ బ్రశంసార్హులే. గ్రంథకర్తకుఁ గావలసినది, గ్రంథమునందలి రసమును విద్వాంసులు గ్రహించుటగాని వేయినూట పదియార్లుగాదు. ఈయంశమును గ్రంథకర్తయే యిట్లుచెప్పియున్నాడు.

మ. గజయూథంబులఁగోరనో యతులముక్తాహారహీరంబులన్......4 పుట

సమాజమువారిట్టి గ్రంథకర్తలకుఁ దగినంత ప్రోత్సాహ మొసంగుటకు సిద్ధులైయున్నారు. కాని ధనలోపముచే వారికోరిక నెరవేరకున్నది కావున గ్రంథ రచనకై తమయానందమునుసూచించుచు సమాజము వారొసంగిన యీచిన్న కర్పూర హారముఁగైకొని గ్రంథకర్త మన్నింపవలయునని సమాజము వారిపక్షమున నేను ప్రార్థించుచున్నాను.

ఇట్లువిద్వద్విధేయుఁడు,

మండపాక పార్వతీశ్వరశాస్త్రి, బి. ఏ.

ఛత్రపురము
సం॥ 1916—1917

శ్రీరామచంద్రాయనమః

# విజయవిజయము

లేక

# కర్ణవిక్రమము.

ఇయ్యది


ఛత్రపురాన్ధ్ర మహాపాఠశాలాపండితులగు

భాగవతుల నృసింహశర్మగారిచే


విరచితము.


శ్రీ విక్టోరియా ముద్రాక్షరశాలయందు

ప్రథమ ముద్రణము ముద్రితము.

బ్రహ్మపురము.

1927

శ్రీరామాయనమః

# కర్ణ విక్రమము

## నాంది

ఉ॥ శ్రీ రమణీమణీ విభుని ♦ చెయ్వ్విలకుం దగు నూతకోలయై
వీరుల పెన్నిధానమయి ♦ విద్యకు లక్ష్మికి నాలవాలమై
భారత పుణ్యభూమిపయి ♦ భాసిలుడాలయి గ్రాలు నిక్కువ
ద్భారత కర్ణపర్వ కవి ♦ తా రసధారల మీరలానుతన్.

సీ॥ శాంతి నిశ్చలమున ♦ సర్వంబు భరియించి
ప్రాణిసంతతికి జీ ♦ వన మొసంగి
చెలువార నెనలేని ♦ తెలివిఁ జేకూరిచి
వ్యాపించి జగతికిఁ ♦ బ్రాణ మిచ్చి
అఖిలంబుఁ గల్గ శూ ♦ న్యంబని ప్రకటించి
కళఁబూని పంకజ ♦ కులమణంచి
విమల తేజంబునఁ ♦ దమము నివారించి
సుమనస్సులకుఁ బ్రియో ♦ దము ఘటించి
గీ॥ అష్టమూర్తు లుండియు లేని ♦ యట్టులుండి
అష్టసిద్ధు లుడియును ది ♦ గంబరుఁడయి
అసమ శరవైరియై కామి ♦ యైన యీశు
నాశ్రయింతుఁ దలంతు నే ♦ నభినుతింతు.

# కర్ణవిక్రమము.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

పూజనీయ విద్వాంసులారా! మా భాగ్య మెట్టిదో గాని మీర లెల్లరు నిచ్చటికి వచ్చి మమ్ముల నానందింపఁజేసి మీర లానందించుటయే మా ముఖ్యోద్దేశమని నిశ్చయించితిని. నాటక మెంతయుఁ జొప్పగ్రమైన మేము నటించుట యందెంతటి సామర్థ్య మును గలవారమయ్యుఁ కవి లోపములు నాటకము నందున్న నిరర్థకమగును. అందుచేఁ కవియు నాటకులుఁగూడ నేర్పరులై నంగాని మీర లానందింపఁజాలరు. ఈకాలమున నాటకము రచించి కవియుఁ బ్రదర్శించి నాటకులు జనుల నానందింపఁ జేయుట మిక్కిలి కష్టము. ఇపుడు జనుల కభిరుచి వివిధ భాషా శైలులందుఁ గనంబడుచున్నది. పూర్వము జను లేశైలిని ద్రాక్షా పాకమని కొనియాడిరో యాశైలి యిపుడు కఠిన నారికేళ పాకమైనది. కారణము దేశభాష యందభిమానము సుంతయు లేకపోవుటయే. అట్లని యెల్లరుఁ గుహనా భాషాభిమానులని వచింపను. అచ్చటచ్చట మహానుభావులు లేకయుందురా ? అట్లు కొలంది మందియున్న నొక లెక్కయా ? స్వాభిమానము, మతాభిమానము, భాషాభిమానము, దేశాభిమానముఁ గల మానవులు మర్త్యులు. ఎల్లరు మెచ్చునట్లు పొత్తముల రచించుటకు బ్రహ్మకునైనఁ దరముగాదు. కపట భాషాభిమానులగు కువిమర్శ కులు సంతసించునట్లు కృతుల రచించుటకుఁ బాండిత్య మన వసరము. పాండిత్యము లేకయున్న జ్ఞానము, లోకానుభవము,

# కర్ణవిక్రమము.

సజ్జన సదభిప్రాయము, దుర్జన దురభిప్రాయము గ్రహించుట యెట్లు ? కువిమర్శకుండు కవిని దూషింపఁగలఁడుగాని భూషింప నేరడు. తాను విమర్శించునట్లు భాషింపఁజాలఁడు. సాహిత్యము, లోకానుభవము, గుణగ్రహణశక్తి, నిరహంకారము, నిష్పక్షపాత బుద్ధి, సదభిప్రాయము, కవిహృదయగ్రహణ ప్రవీణత, బోధనా శక్తి, యభిధానభావ మను, నవనిధులను గలిగి యున్నంగాని సద్విమర్శకుండు గానేరడు. పైగుణములు గల విమర్శకులు కవులకు నిజబంధువులు. వీరలు వారల కృతిరత్నములకు శాణో పలములవంటివారు. మీరలెల్లరు నట్టివారలని యూహించెద. లేనిచో విద్వజ్జనపరిశ్రమము గ్రహింపగలరా ?

స్వదేశ భాషాభిమానులారా! నేడు మేము ప్రదర్శింప నెంచిన నాటకము వెలుపకయే కాల మధికప్రసంగముచే వెచ్చించితిని.

చ॥ ఇరువదియేండ్లవాఁడు కడు । నింపుదలిర్చు కవిత్వమాధురీ
గరిమను కర్ణపర్వమను । గాథను రూపకరూపకంబుగా
విరచనఁజేసె సూరిసుక । విప్రకరప్రమద ప్రధానమౌ
కరణిని; మీరలెల్లరును । గాంచి కృతార్థునిఁజేయుఁడీ ననుఁ.

కర్ణవిక్రమమను వీరరసప్రధానమైన యీనాటకము విరచించిన కవి, భాగవతుల నృసింహశర్మ. ఈ కృతికర్త నాముఖమున నిట్లు విన్నవించుచున్నాఁడు.

# కర్ణవిక్రయము.

శా॥ పాండిత్యంబదియొంతయుండినను సర్వజ్ఞత్వముం గల్గువాఁ
డొండే విష్టపమందు లేఁడు; మదిలో నూహింప దోషంబు లే
కుండన్ గ్రంథము వ్రాసి యిబ్భువిని సర్వోత్కృష్టముం జేయ ద
క్షుండెవ్వాఁడు రసంబు ముఖ్యము కృతిన్ గూర్పంగ భావించినన్.

మ॥ గజయూథంబులఁ గోరునో యతుల ముక్తాహార హీరంబులన్
రజితంబున్ గనకంబు నంబరములన్ గాంక్షించునో పాఠకుల్
సుజనుల్ ధీరజనవ్రజంబు సుకవుల్ మోదించుటల్ పండిత
వ్రజ మేలౌనని జోకసేయుటయు సద్భాగ్యంబుకై మిన్నకున్.

మహాశయులారా! కవివిషయ మటుండనిచ్చి స్వవిషయ మించుక ముచ్చటించెదను. అనేక గ్రంథసారరస సారసౌరభ గ్రహణేందిందిరులగు మీరలు మత్స్వల్పనాటక ప్రయోగమున సంతుష్టిఁ బొందఁజాలరని నేఁ దలంచెదను. ఎక్కుడు విత్తంబు వెచ్చించి పరికరముల గ్రహించినఁగాని నాటకము రక్తిఁ జెంద నేరదు. అయిన నా శక్తి కొలఁదిఁ బ్రయత్నించెద. ఆర్యులారా!

ఉ॥ నాటకమాడ నేర్పరి యనంగ యశంబు వహించినాడ నే
నాటికి లోపముండ దయినన్ నను నమ్ముఁడు మీకు నూతయున్
వాటిలదేమొ మోదమని నామది సందియ మొందుచుంటిఁ బో
రాటమునందు నంగవిభు నాసఁ బెనంగిన రాజు నెంచినన్.

(సూత్రధారుఁడు నిష్క్రమించును.)

ఇది ప్రస్తావన.

# కర్ణ విక్రమము

## ప్రథమాంకము.

రంగము.—కురుక్షేత్రము. దుర్యోధనుని శిబిరము.

—:ప్రవేశము:—

దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు, కర్ణుఁడు, శకుని, శల్యుఁడు,
వృషసేనుఁడు, సత్యసేనుఁడు, క్షేమధూర్తి,
దండధారుఁడు, విందుఁడు మఱియు నితరవీరులు.

దుర్యో:—(తనలో)

ఉ॥ కూలె సురాపగాసుతుఁడు కూలిరి కుంభభవాదివీరు తే
లీల జయంబు చేకురు, ఫలింపని భూమివిధాన నయ్యె నా
యాలము; డెందమంగవిభు నాసఁబెనంగుచునుండె నక్కటా
బేలరినై చెలంగితిని పెద్దల సుద్దులఁ గ్రేసి సేయుచున్.

గీ॥ ఆసలడుగంటె దుర్జయు లైన [illegible]రు
లుక్కు దక్కి నశించిరే దిక్కు లేక;
అక్కటా నాప్రయత్నంబు వ్యర్థమగునె ?
విజయము లభించుదాక నే విడువ విడువ.

(ప్రకాశముగా) ఓ కౌరవవీరవరేణ్యులారా!

కం॥ మానప్రాణంబులకున్
 హాని కలుగనున్న జగము లట్టిటులైనన్
 భానుండు దలక్రిందైనను
 మానధనులు పూనికి-నెఱప మానరుగాదే.

భీష్మద్రోణాది వీరపుంగవులు గతించినను తుదిముట్టఁ బోరాడసమకట్టితి. ఇపుడు సైన్యాధిపత్యమునకుఁ దగినవారలెవ్వరో యూహింపవలయు.

దుశ్శా:—అన్నయ్యా! ఊహించుట కేమున్నది. నీవు నిర్ణయించినవానిఁ గాదన నేరితరము. నీవే నిర్ణయింపుము.

శల్యు:—దుశ్శాసనా! మృదుత్వము నీ నోర నున్నది. కడు బాగుగఁ జెప్పితివి.

కర్ణు:—శల్యా! విమర్శించుటకు నీయంతటివాఁడు గలఁడా? అతఁడు పల్కినది రాజునాజ్ఞ ననుసరించియేగదా? అందు దోసమే మున్నది.

క్షేమ:—రారాజా! నే మొనకాఁడనైన నీవంత మానిపి వైరుల నశింపఁజేసి భీష్మద్రోణులు లేనికొఱంత యావంతయిన లేకుండ నేఁ జేయఁగలను. మద్బలసాహసము లీ వెఱుఁగనివా?

ఉ. వాలికతూపులన్ బఱపి వైరుల నందఱ మ్రందఁజేసి శుం
డాలములన్ వధించి సుభటప్రకరంబుల స్యందనంబులన్
జీలుపడంగ జీకొని కడింది మగంటిమిఁ జూపి పాల్చెదన్
వాలుమగల్ మదంబులను వాఁడిమి వేఁడిమి వీడి భీతిలన్.

# కర్ణవిక్రమము.

ఉత్సాహ॥ భిండివాలమూని కేల భీతిఁదక్క నిల్వ బ్ర
హ్మాండ భాండకోటులల్ల నల్లఁ దల్లడిల్లవే ?
భండనంబు నందెదుర్చు పాండుపుత్త్రు లెల్ల రు
ద్దండుఁడంచుఁ దాకవెఱచి దర్పమెడర వేడరే.

శల్యు:—క్షేమధూర్తి! సైన్యాధిపత్యమునకుఁ దగినట్లు పలికితివి.

గీ॥ ఓసుయోధన చెప్పెద నొక్కమాట
నాలకింపుము గంగా సుతాది వీరు
లాలమునఁ గూలిరని యేడ్వ నేల యితఁడు
భీమసంగ్రామ సమవర్తి క్షేమధూర్తి.

దండ:—(తనలో) ఈ శల్యుఁడు నాపలుకులంగూడ ఖండించు నాయేమి. (ప్రకాశముగా) రాజా!

ఉత్సాహ॥ మసఁగి బీర మెసఁగ సేనుమల్ల చఱచి యేపుమైఁ
గసిమసంగి సైన్యములను కడిమిఁ జెండుచుండఁగన్
మిసిమివీడి నన్నుఁగాంచి మేటిమగఁడటంచు నల్
దెసలఁబాఱి బీరమెడలఁ దెంపుఁబెంపుఁ ద్రెంపరే.

శల్యు:—దండధారా! ఈ పలుకు లర్జునుండు వినిన మెచ్చుకొనును.

శకు:—(తనలో) ఏమి యీ శల్యుని యాగడము. వీరుల నంగఱుఁ దృణీకరించుచున్నాఁడే.

కర్ణు:—(తనలో) శల్యుని యభిప్రాయము గంభీరముగ నున్నదే? ఇతఁడు పాండవపక్షపాతియా యేమి ?

విందు:—భూవరా! నేనుమాత్రము తగనివాఁడనా ?

చం॥ అలవున బల్విదంబులగు సమ్ములురమ్ముల దూసివిచ్చి యా
వలఁ జెలరేగి యేనుఁగుల పై వడి రాపడి మాపుమాపి లా
వలరఁగ వీర తల్లజుల నల్లన నెల్లెడఁ ద్రెళ్లనేసినన్
గలఁగుచు సేన గీన మఱి గాండివి గీండివి వెన్నుసూపరే.

శల్యు:—ఓహో! విందుఁడందఱిని మీఱి పలుకుచున్నాఁడే.

క్షేమ:—మహాభూవర ! నీ నిరసనము మితిమీఱుచున్నది. సైన్యాధిపత్యమునకు నేఁదగనో ?

ఉ॥ మేటిమగండనై రథము మీఁద ధనుస్సును బూని నిల్చి నే
హాటకపుంఖబాణజనితాగ్ని మహోజ్జ్వలకీలలన్ నిరా
ఘాటముగా నరాతి నృప కాననమున్ దహియింపుచుండ నే
పోటరిమిన్నయైన రణ భూతలమందున నిల్వనేర్చునే ?

దండ:—(రోషముతో) శల్యా! నీ వెంతటి వీరుండవోగాని మమ్ముల నందఱ నపహసించుచుంటివి. యుద్ధంబునఁ బుట్టి పెరిగిన మేము సైన్యాధిపత్యంబునకుఁ దగమా ?

మత్త॥ మొక్కలంబుగ వాఁడితూపులఁ బోటుబంటులఁ దాకినన్
వెక్కసంబున బా ఱరె భీతిచేఁ గడుదీనులై
పెక్కుతూపులఁ గాల్బలంబు మఱొక్కటన్ బడవాలురన్
జెక్కుచుండఁగ నిక్కడక్కడఁ జిక్కిచావరె పాండవుల్.

శల్యు:—పాండవులే చిక్కి చచ్చెదరా? ఓహో! అట్లయిన నిది

యొక నూతనాంశము.

దుర్యో:—(తనలో) శల్యుడు మితిమీఱుచున్నాఁడే. నే మంద లించిన నొచ్చుకొనునేమో ? ఇంచుక శాంతించెదంగాక.

కర్ణు:—శల్యా! నీ యభిప్రాయమేమి ?

విందు:—శల్యుని యభిప్రాయముఁ దెలియుట కే మున్నది. అందఱుఁ బిఱికిపందలు. తా నొక్కఁడే మహావీరుఁడు.

శకుని:—బాగుగఁ జెప్పితివి.

సత్య:—కురుభూపాలా! వేవురు బహుభంగుల నెట్లు భాషించినను మజ్జనకుండగు నంగభూపాలుండు సైన్యాధిపత్యమునకుం దగినవాఁడని నీ వెఱుఁగవా?

వృష:—రాజా! పిన్నవాఁడైనను మదీయసోదరుఁడు సత్యసేనుండు సత్యమునే పలికెను.

దుశ్శా:—నేనీ బాలవీరులతో నేకీభవించెదను.

శల్యు:—అంతకన్న కావలసినదేమున్నది.

దుర్యో:—శల్యా! ఇందుగల వీరులలో సైన్యాధిపత్యమునకుఁ దగిన వార లెవరని నీ యభిప్రాయము.

శల్యు:—పాండవు లెవ్వరినిఁ దునుమకుండ యుద్ధముఁ జేయుదురేని విలుఁబూనిన ప్రతివీరుఁడు సైన్యాధిపత్యమునకుఁ దగిన వాఁడగునని నాయభిప్రాయము.

క్షేమ:—అబ్బా! శ [illegible]డెంతటి ప్రతిభావంతుఁడు.

విందు:— వినుచుండుము. వినువారలున్న నిట్టిపలుకులు మన శల్యునినోర నూరుచుండును.

దుర్యో:—మద్రభూనాథా! అట్లుకాదు. భవన్నిశ్చితాభిప్రాయము మాకుఁ గానలసియున్నది.

శల్యు:—అట్లయినఁ గర్ణుని యభిప్రాయ మెట్టిదో తెలుత నే గ్రహించినంగాని నుడుపఁజాలను.

కర్ణు:—నిష్కపటముగ మదభిప్రాయముఁ దెలుత రారాజునకుం దెలిపితినే. నే సైన్యాధిపతినై యెట్లు యుద్ధముఁ జేయుదునో సైన్యాధిపతిఁగాకయున్నను నట్లనేఁ బోరెదను. అందుచే నా యభిప్రాయ మేమనఁ బాండవులు తన జనకునిఁ జంపిరను దుఃఖాగ్నిచేఁ గ్రోధాగ్నిచేఁ గ్రాగుచున్న యశ్వత్థామ సైన్యాధిపతియైన వానికిఁదోడు నేనున్న లాభకరముగ నుండుననియే.

శకుని:—కడు బాగుగనున్నది.

శల్యు:—(తనలో) ఔరా! కర్ణుని బుద్ధిచాతుర్యము. అశ్వత్థామ సైన్యాధిపతియై వానికిందోడుగఁ గర్ణుఁడున్నఁ బాండవులు విపదబ్ధిఁ బడఁగలరు. (ప్రకాశముగా) కురునాథా! కర్ణుని యభిప్రాయము బాగుగనే యున్నది. కాని నా.........

దుర్యో:—శల్యా! బ్రాహ్మణ వీరులయందు మాకు నమ్మకము నశించినది.

శల్యు:—(తనలో) నేననఁదలఁచుకొనినది యితఁడే పలికెను. (ప్రకాశముగ) అట్లయినచో నీ యభిప్రాయమేమి ?

దుర్యో:—కర్ణుఁడుగాని లేక నీవుగాని వహించిన లెస్సగనుండును.

శకుని:—సరియే అట్లయినఁ గర్ణుఁడిందుల కంగీకరించును. అతఁడు

సైన్యాధిపతిగ నుండుటయే లెస్స.

దుశ్శా:—నా యభిప్రాయముగూడ నింతియే.

శా॥ శుంభన్మేఘ రవంబుభంగిఁ గదన క్షోణీ తలంబందు సం
రంభప్రక్రియ దుందుభుల్ సెలఁగ నీ రాధేయుఁ డుగ్రాకృతిన్
గంభీరోజ్జ్వలచాపరోపధరుఁడై గర్జింపుచున్ నిల్చినన్
జంబధ్వంసియు వెన్నుసూపుననుచో సందేహ మొందుందునే.

శల్యు:—కర్ణుఁడుగాని లేక నేనుగాని సైన్యాధిపత్యము వహించిన లెస్సగ నుండునని నీ యభిప్రాయమైనచోఁ గర్ణుఁడా యాధిపత్యము వహించుఁగాక.

క్షేమ:—శల్యా! కర్ణుఁ డాధిపత్యము వహించుగాఁక యని నీవు నుడువనక్కఱలేదు. అతఁడే యాధిపత్యము వహించునని మున్నె మే మెఱుంగుదుము.

విందు:—అందులకు సందేహమేమి ? సైన్యాధిపత్యము వహించుటకు నతనికన్న మేటిపోటరి కురుసైన్యమునఁగలఁడా ?

దుర్యో:— మిత్రమా! అంగరాజా!

ఉ॥ మానధనుండు, శూరుఁ డస మానపరాక్రమ నిర్జితారి, తే
జోనిధి, కుంభసంభవుఁడు సృక్కెఁగదా? నిను నమ్మినాడనో
ప్రాణసఖుండ! వేగమె యపాయములేని యుపాయమొండు డెం
దానఁదలంచి కౌరవ శతంబునకున్ విజయంబుఁ గూర్పుమీ.

కర్ణు—మిత్రమా! ఎన్నటికైన మన కపాయంబొందు వాటిల్లినఁ గదా యుపాయంబు లన్వేషించుట.

శల్యు:—అపాయము వాటిల్లకయున్న దేమి? ముప్పాతిక మువ్వంతుల సైన్యము నశించెగదా! కర్ణా! రారాజున కలచేత వైకుంఠము జూపుచుంటివే ?

విందు:—తేనియలొలుకగఁ బలుకులంబలికి మెప్పింపంగల చాతుర్యము మన యంగభూపాలునకుఁదక్క యితరులకుఁ గలుగ నేరదు.

శకుని:—పాకము మదురుచున్న దే ?

కర్ణు:—కురువీరు లెల్లరు నధిక ప్రసంగమునకుఁ గడంగుటకుఁ గారణ మేమియో ? శల్యా! నీ నక్రవాగ్ధోరణిఁ జాలింపుము.

దుర్యో:—నెచ్చెలీ! వారిపలుకులను బాటింపకుము. భవచ్ఛౌర్యంబుఁ జూపింపఁ దగినకాల మాసన్న మయ్యెను.

దుశ్శా:—అన్నయ్యా! మనకర్ణునకు నీవింత నొక్కి చెప్పవలెనా ?

శల్యు:—చెప్ప నేల ? సర్వముఁ గర్ణుఁడు నెఱవేర్చును.

కర్ణు:—కురునాథా! నీస్నేహంబు చేఁగదా వర్ధిల్లితి. శాత్రవోద్ఘాటనము కర్ణునకు హస్తబదరీభూతమని యెఱుఁగుము?

దుర్యో:—సైన్యాధిపత్యమునకుఁ గర్ణుఁడు తగునని నే నిశ్చయించితిని.

శకుని:—మంచిపని చేసితివి

దుశ్శా:—నే నందులకు సమ్మతి నిత్తిని.

శల్యు:—దుర్యోధనా! నీవనినట్లు కాలమాసన్నమైనది.

విందు:—తగిన క్షత్రియోత్తముఁడు తగునని నాయభిప్రాయము.

క్షేమ:—ఈ చేయఁబోవు కార్యమున కాలోచన కర్తవ్యము.

దండ:—క్షేమధూర్తి యధార్థముఁ బలికెను.
శల్యు:—దుర్యోధనా! నీయిచ్చకువచ్చునటులఁ గావింపుము. వలదని
యనువార లెవరు ?

సీ॥ రూపవద్రోష పౌరుషఘూర్ణితముఖంబు
భయద మార్తాండ బింబంబుఁబోల
నాఁకటిసింగంబు వీఁకను చెలరేగి
కందోయిఁగెంజాయఁ గడలుకొనఁగ
కుండలీకృతచండ కోదండ మండిత
బాహు దండంబులు ప్రజ్వలింపఁ
పులిఁజూచి పాఱు జిం కలవోలెఁ దనుఁగాంచి
పరిపంథిజాలంబు పరువులెత్తఁ
గీ॥ తనచమూకోటిఁ బురికొల్పు కొనుచుఁ జెలఁగి
బవరమును సేయవచ్చు వి ష్వచ్చుమున్న
ద్రోణభీష్ములె విడిచిరి ప్రాణములను;
కర్ణుఁడాపోరుఁ గ్రీడి సింగంబుతోడ ?

కర్ణు:—(రోషముతో) రాజా! వీరలను బాటింపకుము.
శల్యునివాక్కులు మన మెఱుంగనివా ?

ఆ॥ వె॥ ఓలమాసఁగొనక యుద్ధంబుసేయఁగ
నెంచినాను విల్ ధరించినాను
బీరుపోవకుండ బీరంబురేకెత్తఁ
బోరువాఁడ గెలుపుఁ గోరువాఁడ.

గీ॥ అర్జునుఁడు ఫాలనేత్రుని నధిగమించి
నట్టి యిట్టి యని కొంద ఱల్పమతులు
పాండవుల పక్షమున నిల్చి పలికి నంత
మాత్రమున జంకవచ్చునే మానధనులు.

దుర్యో:—(సంతోషముతో) కౌరవవీరులారా! నా యనుంగు సఖుండగు వంగభూపాలునకు సైన్యాధిపత్య మొసంగినాడ. ఎల్లరు యుద్ధంబునకు సిద్ధంబుగ నుండుడు.

దుశ:—అయ్యది యెల్లరు నెఱింగినదే ? మగుడఁ దెలుపవలెనా ?

శల్యు:—దుర్యోధనా! శశకమును మృగరాజుఁగావించిన నెట్లుండునో యట్లున్నది. క్షమింపుము—

కం॥ బంటులు బంటులు పోరుట
వింటిమి వారలకుఁజెల్లు బీరము; సూతుం
డొంటరియై పోరుటఁ గనుఁ
గొంటిమె ? బెండులు మునింగి గుండులు దేలెన్.

కర్ణ:—మిత్త్రమా! కురువంశోత్తమా! ఇందఱి క్షత్రియోత్తములలో నన్నుఁ బెద్దఁజేసితివి. నీమేలు నే మఱువంజాలను. శల్యుని వాక్కులకు ధైర్యముఁ జెందకుము.

సీ॥ రాయంచకోదమమై ఛాయల జిగిమీఱు
హయములతోఁ గ్రాలు నరదమెక్కి
పఘుపఘుర్ఘోషితమై ధనువు హస్త[illegible]దుఁ
గడలేని కాంతులం గ్రాలుచుండ

కర్ణవిక్రమము.

భీషణాకారులౌ వీరులు శింజినీ
టంకారములతోడ హుంకరింప
దేదీప్యమాన ప్రదీప్తకాంచనమయ
ఖడ్గహస్తులు ముందు గంతులిడఁగ
గీ॥ గాఢనిష్ఠురబాణ నిర్ఘాతములకు
నంగలార్చెడు శత్రుసైన్యమును నేడు
నిబిడ దీర్ఘనిద్రను ముంచి నీకు భూరి
విజయలక్ష్మినిఁ జేకూర్తు వినుము సఖుఁడ.

దుర్యో:—అంగరాజా! నిను నే నెఱుఁగనా? నాకుఁ జెప్పనేల?

శల్యు:—సుయోధనా! కర్ణుఁడు పొగడుకొనుటయుఁ జాలు నీవు భళిభళియని మెచ్చుటయుఁజాలు.

చ॥ ఉడుఁగక యెవ్వరెట్లనిన నూఁకొని యుండెదవట్లగాని యీ
నడవడి లెస్సగాదని యనం దలపెట్టవు; సూతసూనుఁ డ
ట్టిఁడయగు నెంతయున్ సరిపడెన్ జెడుచెయ్దముల్లెల్లమీకు; మీ
యెడఁదలయందు మేల్మిజని యింపదు ముక్కుల నూర్పులుండగన్.

క్షేమ:—(దండధారునితో రహస్యముగ) బీరంబులఁబల్కు యే కర్ణుఁడు సైన్యాధిపతియయ్యెను. శక్తులేక దా సదా సర్వ కార్యములకు మూలాధారములు.

దండ:—క్షేమధూర్తి! నీ వట్లనఁజనదు. నిశ్చయముగ నర్జునుని మార్కొనఁదగు వీరుఁడు కర్ణుఁడుగాక మ[illegible]ఁడుగలఁడు!

సత్య:—మద్రభూవరా! మాజనకుఁడు సైన్యాధిపతిగ

నుండుట నీ కనిష్టమైన-నిట్లనఁజనునా ?

వృష:—శల్యున కనిష్టమైన నిష్టముగా వర్తించువారలెవరు ?

కర్ణు:—రారాజా! ఈ శల్యుని పలుకులఁ కులుకఁబోకుము.

మ॥ పసయేపాటిగలట్టి మేటిమగలో పాండవ్యయోధావళిన్
డెసలంబాఱఁగఁజేసి మద్భుజ బలో త్సేకంబుజూపించి క్రొ
వ్వేసలారన్ వడివాఁడి తూపులను లా వింకంగఁబోరాడి నీ
కసిదీరన్ మసిఁజేసి వారలఁగడున్ గారించి కేరించెదన్.

క్షేమ:—(గండధారునితో) వింటివా కర్ణుని ప్రల్లదములు.

గండ:—అయ్యావి నీవు నేనుఁబలికినఁ బల్లదంబులగుఁ గాని కర్ణుఁడు వచించినఁ బ్రల్లదములగునా? ఓయీ! క్షేమధూర్తి! కర్ణునిఁ బరిహాసించుటకు మనము తగము. శల్యుఁడెయ్యదియో పలుకఁబోవును. వినుము.

శల్యు:—కర్ణా! బాహాటంబుగ మేటిపోటరికైవడిఁ బల్కుచుంటివి. నీ బలసామర్థ్యము లెట్టివో తెలియఁజేయుము. వీను లార విని సంతసించెదను.

కర్ణు:—(మందహాసముతో) శల్యా! నా బాహుపరాక్రమము నీకిపు డెట్లు తెలియును. నే నెట్లు చెప్పఁగలను.

ఉ॥ నాటకమందు నెట్లు నట నాయకుఁ బొనర్చెదు చెప్పుమన్నచో
మాటలఁదెల్పు నే నటుఁడు మాదిరిఁ జూపునుఁగాక యట్టులే
పోటరిమిన్న తా నెటులు పోరునో పల్కునె? భీతిఁగొల్పు పో
రాటమునందు వాఁడిమిఁ గ్రియన్ బ్రకటింపక రిత్త పల్కులన్.

# కర్ణవిక్రమము.

శల్యా! మన్మనోధైర్యము నీ వెఱింగియో యెఱుంగకయో నన్నుఁ గ్రిందు సేయుతలంపున నెగ్గులాడుచుంటివి. యుద్ధారంభమునుండి యర్జునుఁడు చూపిన విక్రమ మెవ్వరెఱుంగనిది. చక్రంబు వహింపనని కృష్ణుఁడు చక్రంబుఁబూనుట నరుని విక్రమంబునకుఁ గొలంతయగదా? అప్పుడైన వీరోచితముగ వధింపఁగలిగెనా? లోకమ్మునఁగల యాబాలగోపాల మెఱుఁగుదురు.

చం॥ ఎవనిజయించినాడు నరుఁ డెంతటివీరుడు సిగ్గులేక భూ
ధవుని సభాస్థలిన్ నిలిచి దబ్బులఁబల్కెడువాఁ? వియన్నదీ
భవుని జయించెనో? యకట బ్రాహ్మణవీరవరేణ్యుఁ గుంభ సం
భవుని జయించెనో? నిజముఁబల్కు-ము వాక్కులు పెక్కు-లేటికిన్.

శల్యా! నన్నెఱుంగవుగనుక కోరినవాఁడవగుటచేఁ బలుకుచుంటివి. నా మనోనిశ్చయ మెఱుంగుము.

సీ॥ కొండపైనుండు అా బండఁ గ్రిందుగఁద్రోసి
కెరలికోరాడు నొం టరి యనంగ
నొండుమాటున డాగి యుంచు వేటరిఁగాంచి
బలిమి లంఘించు క్రోల్పులియనంగ
వనసత్త్వములు పంచ బంగాళమై పాఱఁ
గాంతారముంగ్రమ్ము ఖడ్గమనఁగ
మ్రాఁకులఁగూల్చెడి మదపు టేనుఁగుఁజీల్పఁ
జివ్వనఁగుప్పించు సింహమనగ

గీ॥ ప్రళయకాలాంబుదచ్ఛటా పటునినాద
భాంకరణ శంఖరవముతో హుంకరించి

మించి కుప్పించి విచ్చి మేనుఁ ద్రుంచి
వచ్చి నీముందు కురురాజు మెచ్చుగొంటు.

శల్యు:—(సవ్యాజు) ఇచ్చట నర్జునుఁడున్న నీవిట్టి బీరంబులఁ బల్కుటకున్నైన మందహాసముఁ జేసియుండును. కురు రాజును మెప్పించుటకు నిట్టిరిత్తపల్కులఁ బల్కవలయునా?

కర్ణు:—శల్యా! ఏమనుచుంటివి? రిత్తపల్కులనియా?

ఉ॥ చిందఱవందఱొంది కురు సేనలు బల్మిఁదొలంగుఁగాక, నా
స్యందన మస్థిరంబయి ర క్తావనిఁ గ్రుంకకయున్న; నాజిసం
క్రందనుఁ డద్దమైన, హరి కైదువుఁబూనినఁ గ్రీడిఁద్రుంతు; నీ
క్రిందను సేవకుండయి చరించును కర్ణుఁడు రిత్తఁబల్కినన్.

(ఇంచుక రోసముతో) ఓయీ! పాండవులు నీకుఁ జుట్టములగు కారణముననో, నే సైన్యాధిపత్యము వహించితినను నోర్వలేమినో, నోటికివచ్చినట్లు లెగ్గులాడిన సరియా? వీరుని యందుగల నిక్కమగువిలువ నీవేమి గ్రహింపఁగలవు.

ఉ॥ కార్యముదప్పి ముప్పయినఁ గర్ణుఁడు వీసమునైన సాహసా
చార్యములందొలంగఁడను ధైర్యముఁజెంది నరుండుఁ గృష్ణుఁడున్
గార్యముఁబూని సంగరము నన్ రణ ధర్మముఁ దప్పకున్న నా
శౌర్యము నీకుఁ దెల్లమగు చందము జూపెదఁ గ్రీడి బెగ్గిలన్.

క్షేమ:—(రహస్యముగ) శల్యా! వెనుదీయకుము.

శల్యు:—కర్ణా! నోర నాలుకయుండఁ బలుకుల కేమిభాగ్యము.
... ముఖంబు నెన్నండుఁ జూడని ముదుసలియు నీపలుకుల

కన్న నెక్కుడుగఁ బలుకవచ్చును. ఖాండవారణ్యము దహింపఁజేయుతటి నింద్రుఁడు, పోరాడఁజాలక పాశుపతాస్త్రమొసంగి సంధిఁగావించుకొనిన యీశ్వరుఁ డిట్టి పలుకులు నీపజ్జ నేర్చుకొనియున్న నరుని పీచ మడంచి యుందురు. ఇంతకు వారలు నీయట్టి వీరులా ? కర్ణా! వీరంబుల కాద్యాంతము లుండవలదా ?

ఉ॥ ఎక్కడి కయ్యమారి! నరుఁ డెక్కటి కయ్యమునన్ జెలంగి పెం
పెక్కిన కేలుదోయి ధను వెక్కిడి యెక్కులువెట్టు వెన్నుమే
లెక్కులగండుమీఱటి తన యెక్కువఁజూపరు లెల్లమెచ్చ నీ
వెక్కులఁ జక్కసేయఁడొకో ? డెబ్బది దబ్బులబంటువీర మే.

విందు:—భళిరా! మద్రభూవరా! బాగుగఁబలికితివి.

ఉండ:— విని సంతసించుచుము. ఎల్లరు నాక్షేపించుటకుఁ దగిన వీరపుంగవులే.

శకు:—సంతసించుట యెక్కడ. ఇదియంతయుఁ గుందుటయే.

దుశ్శా:—(దుర్యోధనునితో) అన్నయ్యా! ఒకరిఁజూచి యొకరు మర్యాదల నతిక్రమించుచున్నట్టులున్నది.

దుర్యో:—మద్రనాథా! కర్ణుఁడాధిపత్యము వహించుట నీకనిష్టమైన నగుంగాక. ఇట్టి నిరుత్సాహపుఁబలుకులఁ బలుకఁదగునా? వీరధర్మము నీ వెరుంగనిది కాదు కదా ?

శల్య:—రాజా! ఏమనుచుంటివి ? నిరుత్సాహంపుఁబలుకు లనియా ? ఉన్న నిజముఁ దెలిపిన నింత కోపమెందులకు?

# కర్ణవిక్రమము.

చ॥ అలఁతులు గూల్పనేర్తురె మహారణశూరులు పాండుపుత్రులే
పొలుపున వారిఁ జంపగల పోటరియా? నిజ మీవె యుంగవే?
పలుకులఁబల్కినన్ సరియె? పార్థుఁడొకండు దురంబుసేయఁగాఁ
జెలఁగిన, వానితోడ సరి సేయునె ? కర్ణుఁడు విక్రమంబునన్.

ఎదిరిబలిమిఁ దనబలిమి గ్రహించి పోరవలెఁగాని తగుదు
నని ప్రతికార్యముఁ దలనిడుకొనినఁ గీడుగాక మేలగునా?

ఉ॥ రక్కసపల్కు లాడిన దురంబునఁ కర్ణునకున్ జయంబు చేఁ
జిక్కునె ? నీకు నైహికముఁ జెప్పిన పెద్దల నీరసించి లా
వెక్కిన బంటుమిన్నవలె నెచ్చెలు క్రొవ్వునఁ రేఁగినాఁడ వీ
బక్కను సూత నందనుని బంటని నమ్మితివే సుయోధనా ?

కర్ణు:—మిత్రమా! శల్యుని నిరుత్సాహపుఁ బల్కులకు నే
భీతిలువాఁడఁగాను; నన్ను నీవెఱుంగవా ? ఎఱింగియు
శల్యుని వాక్కుల గణింపనేల ?

చం॥ నరములతోడఁ బైకుబుకు నంజుడుముద్దలఁబొడ్చి పెచ్చు నె
త్తురులనుద్రాగు కాకములఁ దోలుచుఁ బీనుఁగుమెక్కు నక్కలన్
దొరకొనిగొట్టుభూతముల తోఁ బయి ఝుమ్మను మక్షికాళితో
వఱలుచునుండు పార్థుసిశవంబు ధ్రువంబుగ నీకుఁజూపెదన్.

శల్యు:—భళిరా! కర్ణా! నిన్ను మెచ్చవచ్చుఁగదరా ?

గీ॥ వాఁడిమిఁగల మొగజోదు వలెఁజెలంగి
పోలఁదగుఁగాక రేకెత్తు బీరమునను

అక్కఱకురాని బిరుదులు పెక్కులేల
దబ్బులకుఁ జెయ్యులకుఁజాల దవ్వుచూవె.

ఉ॥ చండశరప్రహారముల సాహసవృత్తిని లావుమీఱ బ్ర
హ్మాండము బ్రద్దలౌనటుల నాహవరంగమునందు నేఁపుమైఁ
బాండవమధ్యుఁగూల్తునని పల్కుచుఁ గేరెద వాగ్రహించి; సూ
తుండట రాజపుత్రుఁడట దుస్తర సంగరమంట చెల్లరే?

కర్ణా! బహుభాష లేల ?

గీ॥ వాఁడిమనసరి, మన సరి వాఁడిమగలఁ
బిలుకుమార్చిన మిండిచూసి, పలుకునటులఁ
గాడు సేయంగవోడగు పిల్కుఁడు, క్రీడి
తోడ నీవేడపోరాడు టేడ; కల్ల.

దండ:—(శల్యునిఁజూచి) మద్రభూవరా!

ఉ॥ ఎచ్చట నేర్చినావో? గురు వెవ్వఁడో? నేర్పరివౌదు; నిన్ను నే
మెచ్చితి నీదుపల్కులకుఁ మీఁదు వచింపగ నెవ్వఁడోపుఁ గా
ర్చిచ్చువిధంబు ధైర్యమను వృక్షముఁగాల్పఁగఁజాలుపల్కు లీ
మచ్చునఁబల్క నీకుఁగల మచ్చరమెట్టిదో? రాచమచ్చరీ.

కర్ణు:—దండధారా! శల్యుఁడు కురురాజుపైఁగల యభిమాన
ముచే హితోక్తులఁ బలుకుటకు మనను సంతసింపఁదగి
నదే? (శల్యునిఁజూచి) మద్రనాథా! నీవనినట్టు లర్జునుండు
సింహపరాక్రముండనుటకు సందియము లేదు. సూతకుల

సంజాతుండనగు నేను వానితోఁ బోరఁదగదు. అందుచే క్షత్రకులాభరణుండవగునీవు సైన్యాధిపత్యము వహించి పోరాడుము. అందుల కెంతమాత్రము నా యాతంకము లేదు. రాజసహిత మిందుల కంగీకరించును. ఎవరైననేమి? రాజభక్తిఁగలిగి పోరినఁజాలును.

శల్యు:—నీవుండ సైన్యాధిపత్యము నాకేల ?

కర్ణు:—బాగుగఁజెప్పుచుంటివి. పోరవలదని నన్ను వారింపు చుంటివి. సైన్యాధిపత్యము నేను వహింపనని యంటివి. నీయభిప్రాయమేమి? కురురాజు నిప్పట్టున విపదంబుధిలోఁ బడఁద్రోయ వలెననియా ?

శల్యు:—నా యభిప్రాయము..................జయము మనకుఁ జేకూరదుగావున యుద్ధము వలదని.

కర్ణు:—జయాపజయములు నీవెట్లు నిర్ణయింపఁగలవు. ఇప్పట్టున యుద్ధము వలదని పలుకుట పందల లక్షణము.

చం॥ గిలిగొని మంచిఁజెట్ట బరి క్షింపక కింకిరిపాటుతోడ నీ
పలుకులఁబల్క నోరెటుల వచ్చెనొ? దాయకుజాకి నెమ్మదిన్
గలఁతనుజెంది యిక్కరణిఁ గారులఁ బ్రేలుచునుంటివీవు నా
కొలమునఁ బుట్టగాఁదగునె కోఁచవుగాక రాచబంటవే.

క్షేమ:—(తనలో) ఇప్పటికి శల్యునినోరు కట్టుపడును.

దుశ్శా:—శల్యా! పలుకుటకు నాలుక యాడకున్నదా యేమి.

శకు:—మొద్దువోయెఁగాబోలు.

వృష:—వియుండవచ్చును. వాలుసహిత మెప్పుడైన మొద్దు వోవును. అట్టితటినాలుకయున నెంత.

విందు:—కురురాజా! ఇప్పటికేజాలకాల మతిక్రమించినట్లున్నది.

దుర్యో:—ఔను, బాగుగ జ్ఞాపకముఁజేసితివి. అర్జునప్రతాపాగ్నిచే సుక్కియున్న కురువాహిని ఘనుఁడగు కర్ణునిచే వీరరస భూయిష్ఠమై యర్జునమూలంబుఛేదించి పొంగిపొరలుంగాక. కురువీరు లెల్లరు యుద్ధమునకు సిద్ధముగ నుండుడు. దుశ్శాసనా! అంగరాజు సైన్యాధిపత్యము వహించెనని ప్రకటింపఁ జేయుము. మిత్రమా! అంగరాజా! మనమింక పోవుదము.

(కర్ణదుర్యోధనులు నిష్క్రమించినపిమ్మట మెల్లగ నెల్లరు నిష్క్రమింతురు).



ఇది

# ప్రథమాంకము.

# కర్ణ విక్రమము

## ద్వితీయాంకము.



రంగము:— కురుక్షేత్రము — కాలము — రాత్రి.

కర్ణుని శిబిరము — ప్రవేశము:— కర్ణుఁడు.



కర్ణ:—పవిత్ర క్షాత్రవంశమునఁ బుట్టియు సూతనందనుఁ డనిపించుకొనిననేను "సర్వసేనాధిపత్యమున కనర్హుఁడని" కొందఱు దూషింపఁ దలవంచుకొనవలసి వచ్చినది.

ఉ॥ పుట్టితి క్షాత్రవంశమున భూపులభంగియశంబుగాంచి చే
పట్టితి విల్లు సాటి నృప వర్యుల ధైర్యమునన్న గెల్ల; నా
కిట్టికళంక మేల ఘటి యిల్లె? దిసాతుబుకొట్టివట్టి యీ
దిట్టరులెల్లఁ దల్లడిలఁ దేకువఁజూపెదఁగాక యాజిలో.

"తేకువఁజూపెదఁగాక యాజిలో"..................ఎట్లు ?
బ్రాహ్మణశాపము వ్యర్థమైనఁగదా ?......ఇంకొకయనర్థము—

చం॥ నరుని ముఖాంబుజాతము గనంబడకున్న శిఖామణంబు సు
స్థిరస్మృతిఁజెంది పోవ్వరు సహింపుటకుం గడు నుత్సహించు; సం
గరమున వాని నెమ్మొగముఁ గాంచినఁ గేలు వణంకుచుండు ము
మ్మాఱుమునోఁ దగుల్మఁడంచు నభిమానము నెక్కొను కారణంబునన్.

ఈయనర్థ మెట్లు తప్పించుకొనవచ్చును. ఈ బాంధవ్యము నాకుఁ దెలియకున్న నెంతయు మేలు చేకూరి యుండును... ఇపుడు చింతించిన ప్రయోజనమేమి? తల్లియొనర్చు దోసమునకుఁ దనయుఁడును బాధ్యుఁడే?

(అంత శ్రీకృష్ణుఁడు ప్రవేశించి) సోదరుల వధింపఁబాలుపడి సర్వసేనాధిపత్యము వహించిన పాండవాగ్రజున కభినందనము- కర్ణా! జన్మము సార్థకము జేసికొంటివి.

చం॥ తెలిపితినీకుఁ దమ్ములకుఁ దీరని వైరము బోలదంచు నా
పలుకులసుంతయున్ వినవు పాడిఁదలంపవు నీవు తేనికిన్
గెలుపుఘటింపఁ జాల వని కిన్ జెలరేగెదు లెస్సగాదు నిం
దలఁ దలపై వహించెదవు తథ్యముఁబల్కితిఁ బాండవాగ్రజా.

ఇంతకు—కోపింపకుమా—నీవర్జునుని వధింపఁజాలవు.

కర్ణు:—కృష్ణా విపరీతముఁ బల్కుచుంటివి. మాకపజయమా?

మ॥ అరుణంబై ప్రళయాగ్నికుండ మనఁగా నాస్యంబు కెందామరన్
నిరసింపన్ లయకాల కాల నయనాగ్నిజ్వాలయన్ భాతి భీ
కరమై కన్నులఁ గెంపుఁదోప రథినై కాండాసనంబూనినన్
నరుఁడైనన్ గురుఁడైన లేక హరుఁడైనన్ నాకు లక్ష్యంబొకో.

గీ॥ మద్భుజభ్రమితోద్దండ మండలాగ్ర
నిశితధారానిహత ధర ణీతలేంద్ర
మస్తకన్యస్త కోటీర మణుల ఘృణులు
విజయలక్ష్మికి నివాళి విధము గాంచు.

కృష్ణు:—కర్ణా! నీవంతటి వీరుఁడ వగుటచే నిన్నుఁ జేతులార వధింపఁజాలక నిన్ను బ్రతిమాలుచున్నాను—నినుబోలు వీరులెల్లరు నశించిన దేశమేమగును—

చ॥ ప్రళయముదాఁపరించె మన భారతదేశము నాశమొందగాఁ
తెలిసినవాఁడవీవయిన దేశహితంబుఁ దలంపవైతి, ని
శ్చలధృతిఁ బూనిసోదరులఁ జంపఁబ్రతిజ్ఞవహింపఁ జెల్లునే
తలఁపవుమంచిచెడ్డల ను దారుఁడ వయ్యును పాండవాగ్రజా.

నీవు సర్వసేనాధిపత్యము పరిత్యజించి నీయనుజుల నీవు చేరిన యంతనే యుద్ధమంతరించును. ఎల్లరకు క్షేమంబగును. నీకు రానున్న యైశ్వర్యము నిరాకరింపకుము.

ఉ॥ సూతువరింపఁజాలనని సూటిగఁబల్కిన బోటి నీ పదా
బ్జాతయుగంబుఁ గొల్చుటకు సంశయమొందక యుత్సహించుఁ గుం
తీ తనయాగ్రజా హితముఁ దెల్పితి నాపలుకాలకించి ధ
ర్మేతరవృత్తిఁ దక్కి త్యజియింపుము కౌరవరాజ సఖ్యమున్.

ఉ॥ గాండివమున్ గలట్టి తిజ గన్నతవీరవరుండు క్రీడి త
మ్ముండయి నీపదంబులకు మ్రొక్కినఁ జాలదె, ధర్మజుండు నీ
యాడను గొల్చియుండు జగ మంతయు సంతసమొంద; భాగ్యవం
తుండవు నేనుసంతసము దోసిలియొగ్గద నాదరింపవే ?

కర్ణు:—కృష్ణా! నన్నెఱింగియుఁ బలు తెఱంగులు నుడువనేల! పాండవులు నాసోదరులని నేనెఱుఁగనా? చావునకుభీతిలెదనా?

చం॥ గెలుపుకు బొంద లేనియెడఁ గీడ్పడిచచ్చెదఁగాక వైరితోఁ
జెలిమియొనర్ప వెంగలినె! శ్రీయును రాజ్యము మోక్షహేతువే
కలిమియెఱుఁగనో ధనముఁ గాంచనొ పేదనొ నేలనేలనో
తలఁపవొ మంచిచెడ్డల నుదారుఁడు కర్ణుఁడు స్వల్పచిత్తుఁడో.

కృష్ణు:—అట్లనా! ఎంత నిబ్బరముఁగలవాఁడవు.

మ॥ పగ సాధించెదవో యెఱుంగవుగదా బాంధవ్య భావంబు మే
లగునా వైరమునన్; దలంపవలదా యన్యాయమో న్యాయమో
తగునే కౌరవరాజసఖ్యమున సోదర్యంబు వమ్మాయెనే ?
భగవంతుండు జయం బధర్మమున నా పాదించు నజ్ఞానియే.

ఉ॥ రాదలపెట్టితేని కురురాజుఁ ద్యజించెదవేని సూతుఁడన్
వాదుఁ దొలంచి భూవరుని వైఖరిఁ గ్రాలెదవెల్ల భంగులన్;
బోదల నిందఁబాపుకొన నోఁ; దలపోయుము వేళ మించిపో
లేదిపుడైనఁ గార్యము ఫలించును నీకు యశంబు చేకురున్.

(తనలో) కర్ణుఁడు బ్రతికియున్న జయము సందియము. ఇతని నర్జునుఁడు మీఱుటయుఁగష్టము. కష్టముపై కర్ణుఁడు గతించినను పాండవులు మునుమున్ను నన్ను దూషింపఁగలరు. నేఁజేయు ప్రయత్నము లితనివిషయమై నిష్ఫలములైనవి. అగుఁగాక. నాదోషమేమున్నది. (అని యించుక విచార మభినయించి ప్రకాశముగ) కర్ణా! అనేకభంగుల నే నోపునంతదనుక బోధించితిని. పాండవులతోఁ గలసిమెలసిన లోకములన్నియుఁ గొని యాడును. ఇఁక నీయిష్టము. దొడ్డకొంచెముల బాగుగ

పిమర్శింపుము. పాండవశిబిరంబుననో లేనియెడ సంగరంబుననో గలయుదము.

(అని నిష్క్రమించును.)

కర్ణ.—(విచారముతో) అహహా! నాగతి యెట్లున్నది. ఏకగర్భ జనితులగు సోదరులతోఁ గయ్యము లేనియెడ మిత్రద్రోహము. బాల్యమునుండియు సోదరులమై మిత్రవాత్సల్యమున, నన్యోన్యానురాగమున వర్ధిలుచున్న దుర్యోధనునివిడిచి యీ గర్భవైరులగు పాండవులతోఁ జెలిమిఁ గూర్చుటకు నేఁజేసిన పాపమెట్టిది. పాపముఁ జేసినవాఁడ నగుటచే నాగతి యిట్లయినది.

ఉ। వీరులు భీతిలన్ గలువ వింటుకొలంబునఁ బుట్టినట్టి హం
వీరుఁడనయ్యు సూతుఁడనఁ బేరువహించితి నాదుపాప మీ
తీరున నాకుఁ దమ్ములకుఁ దీరని వైరముఁగూర్చె ఘోరసం
చారమునన్ జనించు జన సత్తము దుస్థితి యిట్టిదేఁగదా.

పాండవులు నాకు సోదరులని తెలియుటయే గొప్పముప్పయినది. నాకీ బాంధవ్యము తెలియకున్నచో నెంతయు మేలైయుండును. నా కెంతటి యనర్థము వాటిల్లినది? హా! పరమేశ్వరా.........

(తెరజారును)

# కర్ణవిక్రమము.

## స్థలము ౨.—కురుక్షేత్రము.

---

(బలిమిని దృష్టద్యుమ్నునిఁ బట్టుకొని కృపాచార్యుఁడు ప్రవేశించును.)

కృపా:—ఓరీ! పాంచాలుఁడా! చండాలుఁడా! నిన్నుఁ దాకినందులకు నీ రక్తమున స్నానమాచరింపవలసియుండును గాని—

గీ॥ పరశురామునిఁబోలి కుంభజునిసుతుఁడు
నిన్ను వధియింప నూహించె నిశ్చయంబు;
అక్కతంబున నేను నీ యుక్కడంప
నగునె? ధర్మంబె ? యొకని భోజ్యమవు నీవు.

ఓరీ! బ్రాహ్మణద్వేషి! నేడు నీవు నాతో నేల యుద్ధముఁ జేసితివి? నాచే నేలచిక్కితివి ? పిఱికిపందవగు నీతో యుద్ధముఁ జేయుట దుర్బలయగు నబలతోఁ బోరుటయె. రమణితోఁబోరాడి యోడి వెన్నిచ్చిన రాచబంటు గలఁడని యూహింపవచ్చుఁ గాని, మూర్ఛావస్థనున్న వృద్ధబ్రాహ్మణుని కంఠముఁ దునిమిన చండాలుని నిన్నుఁదక్క యింకొకని యూహింపవచ్చునా ? మూర్ఖా! ఏముఖమున నాకంటఁబడితివి ?

చం॥ పడుచుఁదనంపుఁడెంపునను పాడియెఱుంగక పోతరించి యి
ప్పుడు గడిమీఱి యెక్కటినిఁ బోరగవచ్చుటెగాక యేపుమైఁ
దొడిగితి వొక్క బాణమును తూణము సందుననుండి దీసి, నె
వ్వడిఁగలవాఁడ వైతెఁ జెడి పాఱకుమీ, నినుమోహరించెదన్.

# కర్ణవిక్రమము.

దృష్ట:—ఓహో! ఏమిపాండిత్యము. పోరాడి ఘోషించువారలు లేరా? మోహరించెదనని నీ వనినంత భీతిలెద నేమి? ఇంతటికే గర్వమా?

కృపా:—ఛీ! పాపాత్మా! మాటలాడుటకు నీనోర నాలుక యున్నదా? సిగ్గైన లేకపోయెనా? నీ బ్రదుకునకు యుద్ధ మొకటియా?

చం॥ పరుగిడి పొమ్ము బెండువడి; పౌరుషముండిన లాభమున్నె? భూ
సురునకు నీవు చాలుదువె? జోదులు మెండుగఁ గూలిరా కళే
బరములఁద్రుంచి తృప్తిఁగన వచ్చును ప్రాణములున్నఁ; బోరినన్
మరణము సంభవించు; నభిమానముతోఁ బనియేమిభీరువా.

(తెరలో)...ఓ కౌరవయోధవరులారా!

గీ॥ కర్ణుచే నకులుండు సంగరమునందు
పరిభవింపఁబడెనని సుపర్వతతికిఁ
దెలుప దినరాజు పడమటి మలను జేరె
శీఘ్రముగఁ బాండుపాండింక శిబిరములకు.

దృష్ట:—(తనలో) ఓహో! నావలె నకులుండు నోడెనా?

కృపా:—ఓరీ! పాంచాలా! మాసైన్యాధిపతి వచ్చుచున్నట్లున్నది. మర్యాదఁగలిగి ప్రవర్తింపవలయు. లేనిచో నీ ప్రాణములు దక్కవు

(అనంతరము పూర్వపద్యముఁ జదువుచుఁ గర్ణుఁడు ప్రవేశించును.)

కృపా:—సైన్యాధిపత్యము వహించిన యంగభూపాలునకు జయం బగుఁగాక.

కర్ణు:—ఆచార్యవర్యా! నమస్కారము. (దృష్టద్యుమ్నుఁజూచి యాచార్యునితో) మహాత్మా! పాండవసేనాధిపతివలె నున్న యీతఁడు దృష్టద్యుమ్నుఁడాయేమి? ఈ పుణ్యపురుషుండు మీ కెట్లు చిక్కినాఁడు?

దృష్ట:—(తనలో) అనలమున కనిలము తోడైనవిధమున నాచార్యునకుఁ గర్ణుఁడు తోడయ్యెనే? నాబ్రదు కేమగునో!

కృపా:—నేఁడీ పాంచాలపశువు నాతోఁ బోరాడి యోడి నాచేఁ జిక్కెను. సైన్యాధిపత్యము వహించిన నీకుఁ దగిన యుపాయనముగ వీని నీకొసంగ నిశ్చయించితిని. కౌరవ సేనాధిపా! నీయాజ్ఞ యెట్టిదైనఁ గావించుటకు సిద్ధముగా నున్నాను. అయ్యది నావిధిగదా?

గీ॥ యుద్ధమున నేను జోదనై యుండుదనుక
యధిపతివి నీవు నీయాజ్ఞ నరయవలయుఁ
గారనుంతువో? తుంతువో? కరుణఁగలిగి
కాచెదో? సర్వసేనాధికారి వీవు.

దృష్ట:—(తనలో) అహాహా! అకాలమృత్యువునకుఁ జిక్కితినే? చిక్కినఁజిక్కితిఁగాని కర్ణుఁడు మహోదారస్వభావము గలవాఁడని బహుభంగులఁ బలుకుచున్న లోకమునందలి సత్యము నేఁడెఱుఁగవచ్చును.

## కర్ణవిక్రమము.

కర్ణు:—ద్రౌపదీసహోదరా! పాండవసేనాధిపా! (మృదుకంఠముతో) నీవు ఖిన్నుండవై యిట్లు చింతింపనేల ? నాచేఁ జిక్కినందులకు నీ కపాయమేమియు లేదు.

సం॥ అని యొనరింపఁబోలును, జయాపజయంబుల నిర్ణయింప నెవ్వనికయినన్ దరంబె? యొక పట్టునఁగీడుఘటిల్లుఁగాక; యజ్ఞసుని భవత్సహోదరిని జుట్టములన్ గలరాచజోదులన్ గనుఁగొనఁబొమ్ము నేడొసఁగెఁ గర్ణుఁడు నీకభయప్రదానమున్.

(విచారమునఁ దలవంచుకొని ధృష్టద్యుమ్నుఁడు నిష్క్రమించును)

కృపా:—అంగరాజా! నేఁటి నీయుద్ధక్రమము జయప్రదముగ నున్నది. సైనికులెల్లరు నమితోత్సాహముఁ గలిగి యున్నారు.

గీ॥ కురుచమూవృక్ష సంతతులరి కుఠార
ధారలన్ మోడులై భవద్దర్శనమను
నవవసంతాగమంబునన్ సొరుమీఱి
పౌరుషోత్సాహ భరితమై పల్లవించె.

కర్ణు:—ఆర్యా! భవత్కృపావలోకనంబునఁ గృతార్థుఁడనైతి.

కృపా:—(తనలో) నిత్యకర్మకు వేళయైనట్టులున్నది. (ప్రకాశముగ) కర్ణా! పశ్చిమదిశఁ దిలకింపుము.

గీ॥ బ్రాహ్మణులు మొక్కుసమయంబు పశ్చిమంబు
నలుదెసలఁబాఱి యెలుఁగులం దెలుపుచుండె;
నీను కోప పరితాపసం దీప్తవదన
మండలముఁబోలె మార్తాండ మండలంబు.

కర్ణ:— అవునవును. మీకు వేళయైనది.

కృపా:— నాకాజ్ఞ యొసంగుము.

(అని కృపాచార్యుఁడు నిష్క్రమించును.)

కర్ణ:— మజ్జనకుఁడు సూర్యభగవానుఁడు నాదెస కరుణాదృష్టిఁ జూచుచున్నట్టులున్నదే? తండ్రీ! సూర్యనారాయణా!

మ॥ ననుఁగోపింపకు నీవు కుండలములన్ వర్మంబు నింద్రుండు చే
కొనెనంచున్; భవదీయ పుత్త్రుని నృపుల్ కొండాడఁ జెండాడి న
ల్లనుజల్లాడెద; శత్రురాజసతు లాలాపించుటల్ వింతు; నీ
కనయంబున్ రిపుకంఠరక్తమున నర్ఘ్యంబిత్తు యుద్ధంబునన్.

(అని నమస్కరించి) నన్నుఁ గన్నతల్లియైన కుంతికి నాఁ డొసంగిన వరముప్రకారము భీమనకులసహదేవులఁ జంపక విడుదలఁ జేసితి. ఇఁక ధర్మరాజుఁ బట్టి విడుచుటయు నర్జునుని జంపుటయు నున్నది. నాకుఁ దగినసారథి లేకపోవుటచే నెంతయు గొఱంత వాటిల్లినది. కురువీరులలోఁ గృష్ణునకు సరిసేయఁదగినవాఁ డెవ్వఁడో విచారింపవలసియున్నది. (ఇంచుక యాలోచించి) శల్యుఁ డంతటివాఁడని యూహించెదను. అతడు సారథిగనుండ నంగీకరించునా? అట్లయినఁ గర్తవ్యమేమి? కురురాజుచే వాని నొప్పింపవలయు. (ఎడమకన్నదరును) ఏమేమి? త్రిలోకభాస్కరపుత్త్రుఁడగు కర్ణునకు సహితము హానియుండునా? ఇట్టిస్వల్పములకుఁ గర్ణుఁడు భీతిచెందువాఁడుగాఁడు.

ఉ॥ సంగర రంగమందు సహజన్ముని దేహము పైని సర్వభూ
తాంగ విహంగ సంఘము విహారము సేయగఁ గాంచి సోదరా
యంగవిభుండు సేసెనిటు లంచును ధర్మజుఁ గుందఁజేతు న
ప్పాంగుచు నంతరంగమున భూపతి మిక్కిలి సంతసిల్లగన్

వేగమ దుర్యోధనునితో నీవిషయము ముచ్చటించి యనంతరము నా శిబిరంబున కేగెదఁగాక. (అని నిష్క్రమించును.)

స్థలము 3.—దుర్యోధనుని శిబిరము.

దుర్యో:—(ఆలోచనానిమగ్నుఁడై) కర్ణుఁడు గోరినకోరిక దుర్ఘటముగనున్నది. అందులకు శల్యుఁ డంగీకరించునా! ఎట్లయిన శల్యు నొడంబరుపవలయునని కర్ణుఁడు గుచ్చి గుచ్చి చెప్పెను. కృష్ణునితో శల్యుఁడు సారథ్యమున సమానుఁడనుటకు సందియము లేదు. ఈ విషయము శల్యునితో సంభాషించి సాధ్యమగునంతదనుకఁ బ్రయత్నించెద గాక. పర్యవసాన మెట్లుండునో ?

ప్రతిహారి:—(ప్రవేశించి) జయము జయము మహారాజా! కృపాచార్యుఁడు నశ్వత్థామయు.......

దుర్యో:—సరియే. వారు రావచ్చును.

(ప్రతిహారి నిష్క్రమించును.)

దుర్యో:—రాత్రివేళ వీరు వచ్చుటఁజూడ నెయ్యదియో విశేష ముండవలయు. ఏమైయుండును?........

(అశ్వత్థామ కృపాచార్యుఁడు ప్రవేశించి యాసీనులగుదురు).

కృపా:—రాజా! నీ యాలోచనకు భంగముఁ గావించినవారమైతిమి.

దుర్యో:—భంగమున కేమున్నది. ఆలోచన కేమున్నది.

అశ్వ:—రాజా! నారాఁ నీవు గ్రహించియే యుందువు.

గీ॥ లోకబాంధవుఁ డస్తాబ్ధి లోనడంగ
అంధకారంబు వ్యాపించు నట్లు నాదు
జనకుఁడీల్గిన కతన వి చారమొందు
హృదయ సీమను వ్యాపించె నెఱుఁగుదీవు.

దుర్యో:—(విచారముతో) అయ్యది లోకవిదితము. ఆ విచారము
తొలంగవలెనన్న వైరులఁ దునుమాడవలయు.

కృపా:—అందులకు సందియమేమి ?

అశ్వ:—రాజా! విచారము తొలంగవలెనన్న వైరులఁ దును
మాడుటయని నీవు వచింపవలెనా ? అయ్యది నే
నెఱుంగనా ? యుద్ధము మాకు హస్తబదరీభూతంబని
యెవరెఱుంగనిది. ఇవ్వడీవిషయము నీతో ముచ్చటించు
టలోగల మదభిప్రాయము నీవు గ్రహించియుందువని
తలంచితిని. వివరించెదవినుఁము.

మ॥ జలముక్కాండ విముక్త వజ్ర సదృశా స్త్రస్ఫారధారాహతిన్
గలగుండై పులిఁజూచు జింకగుమినాఁ గన్పట్టదేమూఁక; యీ
పలుకుల్ కల్లలుగావు చూవె కురుభూ పాలా! భవద్గర్భవై
రుల దారా నయనాంబుధారలను నీ క్రోధాగ్నిఁ జల్లార్చెదన్.

కృపా:—రాజునకుఁ గావలసినదేమి ?

దుర్యో:—నేను కోరుచున్న దంతమాత్రమే ?

అశ్వ:—అట్లయిన సైన్యాధిపత్యము నా కొసంగుము.

దుర్యో:—సైన్యాధిపత్య మెందులకు ? లేకున్న యుద్ధముఁ జేయ దగదా? ఎల్లరు సేనాధిపతు లెట్లుకాఁగలరు?

అశ్వ:—సూతుఁడొకండాధిపత్యము వహించియుండ వానిక్రింద బంటనై యుద్ధముఁ జేయుదునా ?

దుర్యో:—సూతసుతుండైన నేమి ? ఎవ్వరైన నేమి? రాజభక్తిఁగలిగి యుండవలెఁగాక.

అశ్వ:—అతని పలుకలఁబట్టి కర్ణుఁడు రాజభక్తిఁ గలవాఁడని యెంచితివా ?

గీ॥ యామినీచరభయము సుంతైన లేని
అనిమిషత్వంబు వహియించి యధిపుఁబ్రోచి
అమరులన్ ధిక్కరించెద నంచుఁ గుక్క
పలుకుఁగాక నైజగుణంబుఁ బాయఁగలదె.

కృపా:—(తనలో) ఓహో! అశ్వత్థామకుఁ గోపము మితి మీఱు చున్నదే ?

దుర్యో:—ద్రోణనందనా! బ్రాహ్మణులపై మాకు విశ్వాసము న ఎనది క్షమింపుము.

అశ్వ:—రాజా! ఏమనుచుంటివి? బ్రాహ్మణుల విశ్వాసము నీకు నశించెనేమి ? అట్లయిన నా బ్రాహ్మణ్యముఁ ద్యజించెద (కోపముతో జన్నిదములఁద్రెంచుకొనును).

కృపా:—హా! కుమారా! ఎంతటి దుష్కార్యముఁ జేసితివి ? బ్రాహ్మణులమగు మన కింతటి తామసంబుతగునా ?

అశ్వ:—మామా! ఏమనుచుంటివి ? బ్రాహ్మణునకుఁ దామసంబు దగదనియా ? అవును.

గీ॥ శాస్త్రకాండంబు తొలఁగి స చ్ఛస్త్రకాండ
మండితంబయ్యె మద్ధస్త మండలంబు
రాచసావాస మొందుసం ప్రాప్తమయ్యె
మామ! శాంతమెట్లుండు బ్రాహ్మణుఁడనైన.

దుర్యో:—నీ వెట్టుపలికినను సరియే. కర్ణున కొసంగబడిన సైన్యాధిపత్యము నీకొసంగఁబడదు.

అశ్వ:—అట్లయినఁ గర్ణుఁడు గతించినంగాని నేను యుద్ధముఁ జేయను.

దుర్యో:—(తిరస్కారముగ) ద్రోణనందనా! సంత సించితిని. (కృపాచార్యునితో) ఆర్యా! తనకొఱకై నేను వేచియున్నానని శల్యునకుఁ విజయఁ జేయవలెను.

కృపా:—అవశ్య మట్లొనర్చెద.

అశ్వ:—మామా! పోవుదమురమ్మి.

కృపా:—రాజా మేమేగుటకు నాజ్ఞ యొసంగుము.

దుర్యో:—చిత్తము. నమస్కారము.

కృపా:—జయమగుఁగాక.

అశ్వ:—అందులకొక సందియమా! (తనలో) కర్ణునకు శల్యుఁడు సారథియగును. పాండవ జయోదంబున కింకశంకయా ?

(కృపా, అశ్వ, నిష్క్రమింతురు.)

# కర్ణవిక్రమము.

దుర్యో:—కర్ణుఁడన్న బ్రాహ్మణవీరులకు ద్వేష మెచ్చులకో తెలియ కున్నది. సైన్యాధిపత్యము ద్రోణునకిచ్చి యనుభవించి నది చాలదా ?

గీ॥ అప్రతిహత ప్రతాపాఢ్యు లయ్యుభూమి
సురలు, కృష్ణుండు వినుతింప నరుఁడు మ్రొక్క
హైనసరేయని పెల్లుబ్బి యాహవమున
నోహటించెద రద్ది జయోదయంబె.

ఇంతియగాక వీరలు కర్ణునకు సరియగుదురా? వీరతో యుద్ధ మేల ? యెట్టివీరులైన సరియగుదురా ?

చ॥ నరుడనినన్ మహోగ్రుడగు నాకు ప్రియంబెఘటించుచుండు సం
గరమునఁ జీరికింగొనఁడు క్రౌంచవిభేదను విక్రమంబు ఖే
చరనుత ధర్మతత్పరుఁడు శౌర్యము ధైర్యము బాహువీర్యమున్
దొఱఁగని రాచజోదు, తులతూగునె యెట్టిఁడునంగరాజుతోన్.

బలగము స్వల్పమైనను నేటి కర్ణునియుద్ధక్రమము జయ ప్రదముగనున్నది. అమితసైన్యము జయంబున కొండు ముఖ్య కారణము కాదుగదా.

చ॥ బలగము లెక్కకున్ మిగులు బారులఁదీర్చిన లాభమున్నె? సై
రుల రణధర్మ మర్మము లెఱుంగు చమూపతిశక్తి, యుక్తి, కా
వలయును గాక; సాకకడు బల్మిఁగలట్టిదమైన నావికుం
డల సతఁజెంది యేమఱిన నంబుధిఁ గ్రుంకకయున్నె వ్రేల్మిడిన్.

ప్రతిహారి:—(ప్రవేశించి)జయము. జయము మహారాజా! మద్రదేశ
మహారాజు ... ... ...

దుర్యో:—సరియే వేగమె ప్రవేశింపఁజేయుము.

ప్రతిహారి:—చిత్తము. మహాప్రసాదము (నిష్క్రమించును.)

దుర్యో:—కర్ణుఁడు కోరినకోరిక నెఱవేఱునా? శల్యుఁడందులకు
సమ్మతించునా? సమ్మతింపనిచోఁ జేయునదేమి? ఊఁ, ఈ
విచారముతోఁ బనియేమి ?

చ॥ ఘనమనుభ్రాంతిఁ గొల్పుపటు గర్జనసేయుచు శ్వేతకాంతులన్
దనరుశరత్పయోధరము దంభముఁగాంచి నిరాశఁ జెంది తృ
ష్ణను దురపిల్లుచాతకము చందము నాదు మనోరథంబు శ
ల్యుని యెడఁ దీర్త్తపోవు విజయోదయయోగము లేకయుండినన్

శల్యు:—(ప్రవేశించి) కురురాజునకు జయంబగుగాక.

దుర్యో:—(లేచి శల్యుని కరముఁబూని) మద్రభూవరా! ఈ
యాసన మలంకరించెదవుగాక. (అని యథాస్థానోపవిష్టుఁ
డగును.)

శల్యు:—(ఆసనోపవిష్టుఁడై) రాజా! నన్నుఁబిలిపించిన కార్యమేమి?

దుర్యో:—(ఇంచుక యాలోచించి) కార్యార్థినై నిన్నుఁ బిలిపించితి
గాని మనోరథసిద్ధి కానేరదనుతలంపున మనంబు తత్త
రిల్లు చున్నది.

చ॥ జనవర నీవు చంద్రకుల సంజనితుండవు; చంద్రవంశసం
జనితుఁడ నేను; నట్టియెడ స్వల్పము నీకునెడఁ గోరవచ్చు నే

## కర్ణవిక్రయము.

అనఘ నెఱకన్ మనోరథము వ్యర్థమయ్యెనను చాలలెస్స; య
ట్లివియెడఁ గోరు కోరిక యది మోఘమయ్యెనను నద్దివ్యర్థమా.

అందుచే నీవు నిరాకరించినను లెస్సయే. ఒక కార్యభారము నీపైనిడఁ దలంచితిని.

శల్యు:—ఆకార్యభారము క్షత్రియోచితమైన భరించుటకు నా కభ్యంతర ముండదు. తగునో తగదో నీవె విచారింపుము.

కర్ణు:—మద్రభూవరా! మనుజునకుఁ దగినపనులనియుఁ దగని పనులనియుఁ గలవా ? నీకు నాపై దయయున్నచో నా కోరికయీడేర్పుము. లేనిచో నీయిష్టము మాదురదృష్టము.

శల్యు:—స్వల్పకార్యముననుఁ గోరదగదని పలికితిని.

కర్ణు:—ఏకార్యము స్వల్పమనంబడునని నీ యభిప్రాయము ?

సీ॥ ఘనునిచే నెట్టికార్యమేన్ ఘనతఁజెందు
గొప్పకార్యమేన్ స్వల్పుచేఁ గొలఁదియగును
ప్రథిమ నైచ్యంబు లూహింప వస్తువునకుఁ
బ్రాప్త పాత్రయోగ్యతఁబట్టి నచ్చుఁజూవె.

గీ॥ పంకగతమైన జలకణం బింకుఁ; బద్మ
పత్రగతమైన మౌక్తిక భంగినొప్పు
శుక్తిగతమైన నయ్యది మౌక్తికంబ
పాత్రయోగ్యత నేదేని ప్రతిభఁగాంచు.

శల్యు:—సరియే. నీ యభిప్రాయముఁ దెలియఁజేయుము.

దుర్యో:—నీవు సారథ్యము వహింపవలయు.
శల్యు:—కర్ణునకుఁగాదుకదా ?
దుర్యో:—కర్ణునకైననేమి ?
శల్యు:—మఱేమియు లేదు. సూతనందనుఁడని—
దుర్యో:—ప్రథిమనైచ్యంబులు జన్మముఁ బట్టియుండునని యా నీ యభిప్రాయము. భూవరా! సర్వమెఱింగిన నీ విట్లు పలుక వచ్చునా ? కృష్ణునకు సరియైనసారథి నీవుదక్కఁ గురు సైన్యంబున నింకొకండు లేడని యీశ్రమ నీ కొసంగవలసి వచ్చినది. నీకు నాపై దయయున్నచో—
శల్యు—(తనలో) అంగీకరించుటకు మనం బొప్పకున్నయది. పాండవ జయోదయమునకైన నంగీకరించెదఁగాక. (ప్రకాశముగా) కురుభూపాలా! నీవింత నొక్కి చెప్పవలెనా ?
దుర్యో:—శల్యా! ఇప్పటికిఁ గృతార్థుఁడనైతిని. చాల సంతసించితిని.
శల్యు:—రాజా! చాలరాత్రియైనట్లు లున్నది.
దుర్యో:—అవును. మన మిప్పటికి విశ్రమించి ప్రాతఃకాలమున గర్ణునిఁ గలయుదము.

(అని యిరువురు నిష్క్రమింతురు.)



ఇది

# ద్వితీయాంకము.

# కర్ణ విక్రమము

## తృతీయాంకము.

స్థలము—కర్ణుని శిబిరము.

కర్ణు:—(నిద్దురనుండి లేచి కనుల నులుపుకొనుచు) ఇపు డెంత వేళయైయుండును? (అని నలుదిక్కులం బరికించి) అహాహా! పశ్చిమదిశ నా సందియమును నివారించుచున్నది.

మ. హరిభీతిన్ గకుబంతభూమిం గలవాం డైయుండగా నంధకా
సురుడా పాదితబాధలందిరుగు తచ్చార్యుల్ వలెన్ బక్షులున్
బారిం బర్వెత్తెసడిన్; బతాకజలదంబుల్ హారవత్తారలున్
విరిసెన్; ఛత్రవదబ్జుండంబరరణో ర్విన్ లంబబింబుండుగాన్.

క్రమక్రమముగ నాకాశము నూతనవికాసముం జెందు కాలము ప్రాప్తించుచున్నది. అహాహా! కన్నులుగల భాగ్యముగదా? ప్రాతరారంభవేళ మేల్కొనువారలకుం దక్క తదితరులకీ విలాసముం గాంచు భాగ్యమెట్లు లభించును.

గీ. పలు తెఱంగుల రంగులం బరిఢవిల్లి
అరుణలేశంబులన్ గ్రాలి యరుణతురగ
మస్తకన్యస్తశోణ చామర మనంగ
సంజకెంజాయ ప్రాచి ను జ్జ్వలితమయ్యె.

## కర్ణవిక్రమము.

యుద్ధముచే నలసిసొలసి గాఢనిద్రావస్థనున్న సైన్యంబులఁ దన సహస్రకరంబుల మేల్కొల్పుటకు బాలభాస్కరుఁ డుదయించు కాల మాసన్నమగుచున్నది.

మ. సురమార్గాటవివాసరాతపమునన్ శుష్కించి కాలంబునన్
మెఱయింపంబడు ధ్వాంతధూపమున శ్యామీభూతమై ఋతుష్వ
ప్వరుచిస్ఫూర్తి వహించి పల్లవితమై భాస్వత్కరవ్యాప్తిచేఁ
బరివేషంబను పేరనిప్పుడు ఫల ప్రాయంబునై భాసిలెన్.

అహాహా! సంపూర్ణ బాలభాస్కర మండలోదయ సందర్శనంబున మన్నయనంబులు సంతుష్టిఁజెందుచున్నయవి. అహో! బాలభాస్కరా! పద్మినీహృదయతస్కరా! అహస్కరా! ఇదియే మన్నమస్కారముఁ గైకొనుము.

గీ. అంధకారకర్దమ దుర్ద మాబ్ధి నష్ట
చేష్టలంగల్గిన సకల జీవములఁ బ్ర
సరితపటుదీర్ఘతరరశ్మి సంచయమునఁ
గాచు భాస్కరునకు నమ స్కారమిదియ.

(అని నమస్కరించి)

మ. తనివింజెందితి భోగభాగ్యముల మిత్రద్రోహముంజేయఁజా
లను బాంధవ్యమురోసితిన్ నరుని గెల్వంజాలినం జాలకు
న్నను ప్రాణంబులనెల్లఁ గోల్పడిన నా నందించెదంగాక; మై
త్రినియామంబుల మీఱనోపుదునె?తండ్రీ! సూర్యనారాయణా.

ఉ. సరిసేయనగు నాకొక్క సూతకుల సంజాతుండు రాధేయుఁడై
క్ష్మారణసీన్ గ్రీడికి సాటివచ్చునని గంగాసూనుఁడున్ ద్రోణుఁడున్
పరుషోక్తుల్ వచియించి నన్నుఁ గికురింపన్ రాజుఁ గావించె; నే
నిరసింపంగలనే సుయోధనుని? తండ్రీ సూర్యనారాయణా.

మ. కలిమిం గోరి చరించుపూరుషుఁడు స్వర్గప్రాప్తికిన్ దవ్వగున్
మలమూత్రాస్పృతమైనయీయొడలు సంసారాబ్ధిలోఁ గ్రుళ్ళిభూ
తలబాంధవ్యముఁ బాయు; సద్యశము నిత్యంబౌచు నూహించితిన్
నిలువంజాల సుయోధనుం బొలఁగి తండ్రీ! సూర్యనారాయణా

ప్రతీహారి:—(ప్రవేశించి) జయము. జయము. మహారాజా! దుర్యోధనమహారాజుగారు, మద్రదేశపురాజుగారు వచ్చుచున్నారు. దూరమునుండియే వారలఁ గనుంగొని యేలినవారికిఁ దెలియఁజేయవచ్చితిని.

కర్ణ:—అట్లనా. నీవిచ్చట నాసనంబుల నలంకరించి సిద్ధముగ నుంచుము. ప్రాతఃకాలకృత్యములఁ గావించికొని సత్వరముగ వచ్చెదను.

(కర్ణుఁడు నిష్క్రమించును.)

ప్రతీ:—నేఁ బుట్టినది మొదలు కర్ణునిఁబోలిన మహానుభావునిఁ జూచియెఱుంగను. తన కుమారుల నెట్లుపోషించునో యాశ్రితుల నట్లుపోషించును. రాజునను గర్వ మించుంతయు లేదుగదా? లోకంబునఁగల దరిద్రులు ధనికులైనచో నెట్టి మిడిసి కన్నుఁగానక సంచరించుచుందురు. ఇతని

యెడల నయ్యది కనుపట్టదు. ఇతఁడు సూతుఁడని యందురు. అయ్యది నేను విశ్వసింపఁజాలను. ముఖలక్షణంబులఁబట్టి మనుజుని చారిత్రి మించుక గ్రహింపవచ్చుఁగదా. ధర్మరాజు చాల మంచి వాఁడని యందురు. మంచితనంబునఁ గర్ణునకతఁడు సాటిరాడని నా యభిప్రాయము........

సీ. జనపతి తనకొసంగిన యంగదేశంబు
పాలించుకొండని ప్రజకొసంగె
అడుగనివారిదే యాతంకమనఁ—చేతి
కెమ్ము లేదనునట్లు సొమ్ములిచ్చె
లక్షాధికారికి భిక్షాధికారికి
వ్యత్యాసమెన్నక వ్యవహరించె
దండించుట త్యజించి ధర్మమార్గంబున
సమభావమునుజూపి సంచరించె.

గీ. ఆత్మవత్సర్వ భూతాని యనుమతంబు
నిత్యదినచర్యలోఁ బెట్టి నెగడఁ జాలె;
విప్రుఁడో భూపుఁడో యెట్టి వీరవరుఁడో ?
కర్ణుఁడు మహానుభావుండు ఘనతముండు.

సడి వినంబడుచున్నది. వచ్చుచున్నారు. (అని యాసనంబుల నలంకరించి యొకమూల నిలిచియుండును.)

(కర్ణశల్యదుర్యోధనులు ప్రవేశించి యాసనోపవిష్టులగుదురు.)

కర్ణు:—(దుర్యోధనునిఁజూచి) మిత్రమా! మద్రరాజు నీ యభిప్రాయముతో నేకీభవించెనని తలంచెదను.

దుర్యో:— నిన్నుం దేహముగ, నాయందభిమానముంగల మద్రనాథుం డెప్పుడైన నేఁగోరునది నిరాకరించెనా? నిన్ను, మదేశ్వరునిఁ జూచుకొనియేగదా యుద్ధభారము వహించితిని.

శల్యు:— అవునవును. నిన్నుఁ బుట్టించుటకు సంకల్పించియే బ్రహ్మ మున్ను నన్ను సృజింపఁ జేసియుండును.

కర్ణ:— భావము గూఢముగ నున్నది.

దుర్యో:— అవును. అగ్రాహ్యముగనున్నది—

శల్యు:— రారాజా! మనము మార్గమధ్యమునఁ బ్రసంగించిన విషయ మొకప్పుడీవియ్యకొనిన నంగవిభుండుమాత్ర మంగీకరింపఁడని నే నెఱుంగుదును. అయిన నీవు నొక్కిచెప్పిన నంగీకరింపకుండఁడు. అంగరాజా! మా యభిప్రాయముతో నేకీభవించెదవా?

కర్ణ:— మీ యభిప్రాయ మెఱుంగకుండ నెట్లు వచింపఁ గలను? (దుర్యోధనుఁజూచి) మిత్రమా! ఆ యభిప్రాయ మెట్టిది?

దుర్యో:— అయ్యది మదేశ్వరుఁడే వచింపఁదగును.

శల్యు:— మఱియేమియు లేదు. ఈ యుద్ధముచే లోకమంతయు నల్లకల్లోలమగుచున్నది. అందుచే.........

కర్ణ:— సంధిప్రయత్నమా యేమి?

దుర్యో:— అట్టిదే.

శల్యు:— అవును. నీకనిష్టమా?

కర్ణు:—సంధికాల మతిక్రమించినది. ఇపుడా ప్రసంగమెందులకు ?
దుర్యో:—నేఁ బలికినదియు నింతియే.
శల్యు:—మీరు సంధిగావింపనిచోఁ గీడుమూడును.

చ. పగఁగొనరాని కీడగు ధ్రువంబుగఁ బొందికఁగూర్చు టెంతయుం
దగునది లెస్స; పౌరుష మదంబునఁబోరినఁ జావు దక్కమే
లగునది యొండు కల్ల; యడి యాసను గెల్పునకై పెనంగినన్
దెగి నశియింతు రెల్లరును దెప్పరపుంబవరమ్ము మేల్మియే.

రారాజా! నీవైన బాగుగ నాలోచింపుము. నష్టముఁ
బొందెడువాఁడవు నీవు. అటుపై విచారించిన లాభము లేదు ?

కర్ణు:—మద్రనాథా! ఇది యేమివెఱ్ఱి ? యుద్ధమునకు వెఱచియా
సంధిప్రయత్న మూహించితివి.

ఉ. లగ్నముఁ బెట్టినాఁడ జయ లక్ష్మినిఁ బెండిలియాడ, నాదు బా
ణాగ్ని వెలుంగుచుండ నెవఁ డాహుతిఁగాక తొలంగఁజాలు;ను
ద్విగ్నమనంబునన్ నరుఁడు తేరును డిగ్గితొలంగఁ గృష్ణునిన్
భగ్నజిగీషుఁ జేయఁగల వాఁడను, వాక్కులు పెక్కులేటికిన్

దుర్యో:—మద్రినాథా! మగుడ నిరుత్సాహపుఁ బలుకులఁ బలుకఁ
వలదని ప్రార్థించెదను. ఎంతటి బలియుండైన నిరుత్సాహం
బున బలహీనుండగును. నీ వెఱుంగనిదికాదుగదా ?

శల్యు:— నీమంచికొఱకుఁ బలికినపలుకులు నిరుత్సాహంపుఁ
బలుకులని నిరసింపఁదగునా ? నే వచించునది యించుక
విచారించి గల కల్ల, నిజము గ్రహింపుము.

గీ. ఆలమందల గెలుచు నా డాలమందుఁ
గ్రీడితోడ నీసఖుఁడు పో రాడలేదె ?
నాఁటికిని నేఁటి కేపాటి మేటియయ్యె
నరయ రిత్తపల్కులమేటి యయ్యెఁగాక.

కర్ణ:—ఒకప్పు డపజయము వాటిల్లెఁగాక. అంతమాత్రమున వచ్చు నష్టమేమి ?

గీ. సమయమునుబట్టి భయదపం చాస్యమైన
నక్కుకొంజిక్కి సుక్కిన స్రుక్కవచ్చు
నంతమాత్రాన నక్కసిం హంబుకన్న
బలిమిఁగలమేటి మెకమంచుఁ బలుకనగునె?.

దుర్యో:—మద్రేశ్వరా! నీయభిప్రాయమేమి ? అంగరాజు వీరుఁడు కానేరడనియా?

శల్య:—నాయభిప్రాయము నీవుగ్రహింపలేకుంటివా? కర్ణుఁడైనను మేటిపోటరియని వచించుటకు నాకెట్టిసందేహము లేదు. గాంఢీవంబుగల గండుమగండగు కిరీటిధాటి మున్ను కర్ణుఁ డేపాటిమేటియని నాయభిప్రాయము.

కర్ణ:—రాజా! శల్యునివాక్కుల నేల గణించెదవు.

గీ. వైరివీర ప్రకాండ గం భీరజలద
పంక్తి. మజ్ఝాణ పక్ష ప్ర భంజనంబు
మించి నగ్గడలఁ బరాక్ర మించునెడలఁ
బాఁచబంగాళమై భీతిఁ బఱచకున్నె.

శల్యు:—కర్ణా! నీజన్మ మెక్కడ, సహజశౌర్య ప్రతాపములుగల యర్జునుం డెక్కడ.

చ. భళి! భళి! నీదు చందము సెబాసని లెస్సగ మెచ్చవచ్చు; నీ
పలుకుల కేమి లెమ్ము కలవా? పలువా? హరిణంబు కాలు క్రో
ల్పులి బలివారులావరియె? పొచ్చెపు బుట్టుకఁ బుట్టి రాచ బె
బ్బులిఁ గికురింపగాఁ దగిన పోటరిమిన్నవె? కన్నుఁ గానవే?.

దుర్యో:—(తనలో) నేను నిరుత్సాహముఁ జెంది యుద్ధము మానుదు నను తలంపున శల్యుఁడిట్లు పలుకుచున్నాడు. నే నిటనుండి పోవుటయే చాల లెస్స. (ప్రకాశముగ) అంగరాజా! నిరుత్సాహముఁ జెందకుము. మద్రనాథా? యుద్ధకార్యంబుల నరయవలయు. సంగరరంగమునను గలయుదము.

(అని దుర్యోధనుఁడు నిష్క్రమించును)

కర్ణ:—మద్రనాథా! నీయభిప్రాయ మేమి? మర్యాద నతిక్రమించి నోటికివచ్చినట్లు పలుకుచుంటివి.

శల్యు:—అంగరాజా! నీవు మూర్ఖించి యుద్ధముఁ జేసిన సుయోధనుఁడు వైరులకుఁ జిక్కి నశించును. వెండియు యుద్ధము వలనఁ గల లాభ మేమి ?

గీ. రణము జనుల చావులకుఁగా రణము, క్రీడి
దరము పూరించినన్ నీకు దరముపోడము
నార్తియించుక వంచిన నార్తిమొనరు
నాశుగము లేయ, వెడలుఁ బ్రాణాశుగములు.

కర్ణు:—ఏమీ? కురురాజు వైరులకుఁ జిక్కునటనా? ఓమామ చెవఁగాక.

ఉ. ఒక్కటి మాటవేలుపులు నుక్కునఁదాకిన భీతిఁజెందఁబే
రెక్కిన మేటిపోటరిని; యీనరుఁడా కురురాజుఁబట్టు నీ
యుక్కరిమిన్న, మిన్నకను యుద్ధమునందున మద్రనాథ! నా
ముక్కననూపిరుండఁగుడు భూపతి వైరులచేతఁ జిక్కునే.

శల్యు:—కొంచెపు బుద్ధిఁగలవారికేమి చెప్పినను లాభములేదు.
రాజ్యము నశించుటకుఁ గాలమువచ్చినది.

కర్ణు:—దానికెవరేమిచేయఁగలరు. శాశ్వతముగనుండునని యెవరు
నిశ్చయింపఁగలరు.

శా. క్రీడింగెల్చుట నాకశక్యమగుఁబో కీడ్పాటువాటిల్లుఁ బో
ఖేదున్ శ్రీలఁదొలంగినం దొలఁగుఁబో ప్రేమంబు మా యిర్వురన్
గాడంజెందునె? భాగ్యభోగముల నక్షయ్యంబు గాఁగల్గువాఁ
డేడీ చూపు మొకండు లేఁడు భువిలో నేమందు నీబుద్ధికిన్.

శల్యు:—అంగరాజా? ఎట్లో యీయంగరాజ్యము దుర్యోధనుఁ డొసం
గినాడు? హాయిగ నింట ననుభవింప నేరక యుద్ధముఁజేసి
చావనేల? ఇందు దుర్యోధను దూషింపరాదు. రాజ్య
మాతఁడొసంగెఁ గాని యనుభవించుట నీలోనున్నది.

కర్ణు:—రాజ్యము శాశ్వతంబుగా నూహించితివా? నీ రాజ్యము
నీతో వచ్చునని యూహించియా యుద్ధమునకు వచ్చితివి?

మ. కడిమిన్ బాలనసేయునట్టి భువి నొక్కండైనఁ గొంపోవఁజా
లఁడు; ఖండీకృత పంక్తికంఠుఁడు యుగా లంకారభూతుండు రా

ముఁడు భూమింగొనిపోయెనే సఖునకై పోరాడెఁ? హా స్నేహపా
త్రుఁడు కర్ణుండు నృపోత్తముండు కృతకృత్యుండంచుఁ గీర్తింపరే.

శల్యు:—నామాటవినుము. ఈ వేదాంతము నీకు మోదాంతముగు గాని ఖేదాంతము గానేరదు. నీవు సాహసించి యుద్ధముఁ జేయఁ దలంపకుము. అర్జునుఁడు నిన్ను విడువఁడు.

ఉ. "తాలిమిఁబూని కోరికఁ దప్పక సుఖంబుగ నుండలేక గు
ర్రాలను తోలుకోక సమరంబును సల్పగ వచ్చినాను పోఁ
గాల" మటంచు నీవు మది గాఢతరంబుగఁ గుందువేళ వాఁ
డాలమునందు నిన్ విడుచునా? వధియింపక సూతనందనా.

అందుచే నీకొక రాజనీతిఁ దెలిపెద నాకర్ణింపుము.

చం. అరుల పరాక్రమంబు స్వబలాతిశయంబును మీఱజేయున్నచో
నరసి,నృపుండు సంధికిఁ బ్రయత్నముసేయుట చాలలెస్స; సం
గరమున నెట్టినేర్పరియుఁ గార్యఫలంబును జెందనోపఁ డె
క్కరణినినైన పొందికయ కర్జము; ఖడ్గము లాభహేతువే.

నాయందు దయయుంచి యీవిషయమై బాగుగ నాలోచింపుము. ఈ తరుణము మించిన పైని విచారించిన నేమిఫలము. గుఱ్ఱములఁబూన్చి రథముతో మగుడ నే వచ్చునంతలో నీ స్థితి విచారించుకొనుము. (అని నిష్క్రమించును.)

కర్ణు:—(మిక్కిలి విచార మభినయించి, నిట్టూర్పు విడిచి) ఆహా! కౌరవరాజ్యలక్ష్మి కెట్టి దుర్దశ వాటిల్లనున్నది. సమస్త భూపాల మస్తకన్యస్త కోటీరమణి విరాజచ్చరణుండై,

గదా ? సుయోధనునకు జయము లభించునో లభింపదో ప్రస్తుత మూహింపఁజాలను. అందుచే సైన్యమెక్కుడుగ వ్యయముఁ జేయఁ దగదు. ఇయ్యది రాజనీతియుఁగాదు.

గీ. అల్ప ఫలితంబునకు హెచ్చు వ్యయముసేత
హానికిన్ గారణంబగు నండ్రు బుధులు;
అధికఫలమున్న స్వల్పవ్య యమున హెచ్చు
రక్షణముసేత, విబుధుల లక్షణంబు.

రథమునచ్చు సడి వినవచ్చుచున్నది. శల్యుఁడు వచ్చుచున్నట్టులున్నది. యుద్ధమువలదని మగుడ నితడు పల్కినచోఁ గఠినముగ మందలించెదఁగాక.

శల్యు:—(ప్రవేశించి) అంగరాజా! వచ్చినది విమానము.

కర్ణు:—ఛీ? వృథామంగళపాఠకా.

శల్యు:—అట్లుపలికిన లాభమేమి? నామాట వినుము. దురభిమానమున లాభము సుంతయులేదు. పాండవులతో సఖ్యముఁ జేయుదువేని నీకుఁ గొంతరాజ్య మిప్పించెద.

కర్ణు:—రాజ్యమిప్పించెదనని నీ వనినంతమాత్రమున మిత్రద్రోహమునకుఁ బాల్పడుదు ననుకొంటి వేమి ?

ఉ. మోహవశంవదుండనయి మూరెడు భూమికి నాసజెందుచో
నాహవముందొలంగఁదగు నయ్యదిధర్మమె? శాశ్వతంబె యీ
దేహము, దుర్యశంబు నలు దిక్కుల మబ్బయి ప్రాకునన్న సం
దేహమె? యింతకుందగునె స్నేహము పట్టున ద్రోహమెంతునే.

శలు:—అర్జునుని పరాక్రమము నీవు బాగుగ నెఱుంగవు గావున నిట్టి నిరర్థకనీతులఁ బలుకుచుంటివి.

ఉ. అర్జనుఁడన్న పందయని యాత్మఁదలంచితె? వైరిభర్జనో
పార్జనుఁడం చెఱుంగుము మహాహవదోహదకేళి లాలసో
త్సర్జిత మృత్యురూప శర చాపగుణధ్వని పోలుఁ గాండము
గ్గర్జన ధర్మరాణ్మహిష కంఠఘళం ఘళకాంస్య కింకిణిన్.

కర్ణు:—భళిరా? పాండవమాగధా! బాగుగవర్ణించితివి.

శల్యు:—అట్లనినఁజాలదు. పిన్నతనంబునుండియు విలుఁబూని పోటరిననుచుఁ జెలంగుచుంటివే? మహావీరు నొక్కనినైన గెలువఁ జాలితివా ?

కర్ణు:—గెలుచుటయేగాదు. ఆమహావీరుఁడు నాధాటి కోర్వఁ జాలక పట్టణం బొండొసంగి సంధిఁగావించికొనియెను.

శల్యు:—ఇది యొకనూతనాంశము. వర్ణించిన నాకర్ణించి సంతోషించెద.

కర్ణు:—కోరినవాఁడు వగుటచేఁ దెలిపెద వినుము.

ఉ. కంధితరంగసంఘముల కైవడివచ్చు దళంబుఁదుంచి, ని
ర్బంధమునన్ గళింగవిభు బాలిక మిత్రునకిచ్చి యా జరా
సంధునిగెల్చి; సంధికి నొసంగిన యాతని దేశమొంది, ద
ర్పాంధుఁడనై చరాచర భయంకరవీరుఁడునాఁ జెలంగితిన్.

శల్యు:—ఇట్టి విశేషముల నేను సహితము వర్ణింపఁగలను. వినుము.

ఉ. వాలమునన్ నగంబులను వక్కల వ్రక్కలఁజేసి, మత్తశుం
డాలములన్ వధించి, సుభటప్రకరంబుల మెంపణంచి, శా
ర్దూలములన్ నఖంబులను ద్రుంచి,సుధాంబుధిఁద్రావి త్రేన్చి,మా
ర్జాల మొకండు పూర్వము దురంబున శౌర్యముఁజూపె నీవలెన్.
కర్ణ:—నేఁబలికినది కల్లయనియా నీయభిప్రాయము.
శల్యు:—అందుల కొకసందియమా ?
కర్ణ:—జరాసంధుఁడు నాతోఁ బోరాడియోడి మాలినీనగరము
నాకొసంగినట్లు నీవు వినియుండలేదా ?
శల్యు:—(తనలో) అవునవును. మఱచితిని. (ప్రకాశముగా) పరశు
రాముని మోసపుచ్చినట్లు బ్రాహ్మణవేషంబున జరా
సంధుని యాచించియుందువు.
కర్ణ:—మద్రినాథా! ఇట్టి యధర్మమునకుఁ బాల్పడుచుంటివేమి.
కురుదేశంబునను ధూమకేతువు నీరూపంబున నవతరించెనా
యేమి ?
సీ. పృథుచక్రవర్తిచేఁ బెనుపొందుటంజేసి
పృథ్వీనామంబున వెలయుచుండు
వసుధాసతీఫాల భాగంబునందునఁ
బొలుపొందు సింధూర తిలకమనఁగ
నలరి, శ్రీభారతీ లలనాలలామలన్
గారాబుచెలులతోఁ గలసిమెలసి
నరచక్రవర్తుల బాహుపంజరములఁ
జిలుకచందాన ముద్దులఁజెలంగి

గీ. తనరు భారతమాతకుఁ దనయయనఁగ
గ్రాలు కౌరవప్రాజ్య సామ్రాజ్యలక్ష్మి
కాదుఁ జెందఁగఁ దలఁచితే కౌరవేశుఁ
డెట్టి యపకార మొనరించె నిట్టులాడ.

శల్యు:—నను దూషింపనెంచితివిగాని, నీ మిత్రుఁడొనరించు దోషములఁ గ్రహింపకుంటివి.

గీ. విషముఁబెట్టుటకుందోడు పృథ్వినపహ
రించి, కానల పాలొనరించి, ద్రుపదు
బాలికంబట్టి, కటకటా! పరిభవించెఁ
బాండవులొనర్చు నపకార మొందుగలదె.

కర్ణు:—ఇప్పుడా ప్రసంగముతో నేమి. కురుపాండవు లన్యోన్యము చెడుగులఁ గావించుకొనిరి. మనకా ప్రసంగముతోఁబని లేదు.

తనకుఁగర్తవ్యమైన విధి మనుజుఁ డొనరించుటధర్మము.

శల్యు:—అట్లని కీడువచ్చునని గ్రహించియు నగ్నిహోత్రమునఁ బడుటయే ధర్మమా ?

కర్ణు:—ధర్మమన నెట్టిదియో నీ వెఱుఁగవు.

చ. మును మనుజుండు కార్యఫలమున్ మదినెంచగరాదు లెస్సయై
నను చెడుగైనఁ గార్యము లొనర్చుట ధర్మము, తత్ఫలంబు రా
జనుభవ మొందుఁగాక; సమరావని నాదు రథంబు క్రుంగినన్
దనువు దొఱంగు; దోషరహితంబుగ నావిధి నే నొనర్చెదన్.

మద్రనాథా! నా మనోనిశ్చయముఁ దెలిపెద వినుము.

గీ. రాజవరునకుఁ గలవు మార్గములు రెండు
పిడుగులంబోని యలుగులం దొడిగి ఫులఁ
దున్ముంచి, రక్తాన్నమున్ భుజి యించుటొండె
క్రోలు పులిఁబోలిపోరాడి కూలుటొండె.

శల్యు:—అవునవును. ఆ మార్గములు రెండు రాజవరునకుఁగాని సూతునకుఁగావు. అంగరాజా! గాండీవికి విజయుఁడను నామముఁ గలదని యెఱుఁగుదువా?

కర్ణు:—నేనుసహితము విజయుఁడనే.

శల్యు:—అదియెట్లు ?

కర్ణు:—గాండీవికి గాండీవంబను విల్లెట్టిదియో యట్టిదియే నా విజయంబను విల్లుసహితము. అందుచే నే విజయుండనగుదు. ఈ మహాధనుస్సు వహించియే భార్గవుండు క్షత్రియ లోకంబును సంహరించెను. ఇప్పుడైన నీ సందియము నివారింపఁబడుఁగాక.

శల్యు:—విజయమను విల్లొండుచేఁబూని పౌండ్రకవాసుదేవునివలె నశింపఁగలవు. గాండీవియెక్కడ నీవెక్కడ.

చ. పలువ యెఱుంగఁజాలునొకో పాండవులంగలసత్తు, రజ్జులన్
బలుకగవచ్చు, సూతసుతు పల్కులు ముల్కులఁబోలి దాయలన్
గెలుచనఁగూల్ప జాలునొకొ, భీముడు, గద్దఱి పెద్దరాచ బె
బ్బులియగు క్రీడి, కైదువులఁ బూని చెలంగిన నాసలున్నవే.

కర్ణు:—(తనలో) ఊరకున్నకొలంది నీ మూర్ఖుఁడు నోరికివచ్చినట్లు ప్రేలుచున్నాడు. (ప్రకాశముగా మిక్కిలికోపముతో)

మ. మతిలేదో జ్వరసంధి యుద్భవిలెనో మద్యంబు గంజాయిఁ ద్రా
గితివో ని న్మదినమ్మినన్ నిజముగాఁ గీడ్పాటు వాటిల్లు; దు
ర్మతి నా సారథివౌటచే బ్రదికితౌ రా! లేనిచో నిప్పుడే
శితబాణాళి మహాప్రహారముల నీ శీర్షంబు ఖండింపనే.

గీ. వీరవరులని వైరుల విసుఁగులేక
పొగడనేటికి మమ్మిట్లు దెగడనేటి
కక్కటా! నీకు బ్రదుకుపై నాసయున్న
పాండవుల నాశ్రయింపుము భయమువలదు.

మూర్ఖా! నోరికివచ్చినట్లు పేలుట యెఱుంగుదువుగాని నా పరాక్రమము నీవేమి యెఱుంగుదువు.

ఉ. దండకుఁజేరి వైరిభుజ దండము లొక్కటఁద్రుంచి దివ్య కో
దండ విముక్త కాండ జనితంబగు వహ్ని రణంబులోన వే
దండములన్ దురంగ భట తండములన్ దహియింపఁ గర్ణు డా
దండము, నీదు తూపులకు దండము దండము దండమంచు దో
ర్దండము లెత్తి మ్రొక్కి రిపుతండము గండముఁ దక్కియుండగన్.

శల్యు:—నీ వంతటికార్యముఁ జేయఁజాలనివాఁడవైనను సంతసించెద
ఏమందువేని ?

ఉ. పోలుపరాని పోటరియు పోరుటకుందగు, సూతుఁ డాజికిన్
జాలఁడు, నిక్కువంబయినఁ జాలుదునంచును వారువంబులన్
దోలుటఁ దక్కియెక్కుడు ధనుస్సున వైరినెదిర్చి, పాఱినన్
జాలును; వంధ్యకాన్పుఁ గనఁ జాలినఁజాలదె గ్రుడ్డిబిడ్డయున్.

# కర్ణవిక్రమము.

కర్ణు:—నీ నాలుక(ద్రుంచినఁగాని యీ యున్మత్తప్రలాపములు కట్టువడవు.

గీ. ఈరసముఁజూసి వివ్వెచ్చు పోర నన్నుఁ
ఓలుకుమూర్ఛ నటంచును పలుకుచుంటి
వింక వ్రేలిన నీదు లా వింక నాదు
నారసంబుల నిను(జేతు నీరసంబు.

శల్యు:—బాగుగ నాలోచించుకొనుము. యుద్ధము వలదుసుమా. ప్రాణాపాయకరము సుమా.

కర్ణు:—నీ పలుకులకు భీతిసెదనా యేమి?

గీ. ఓహటించక వైరుల మోహరించి
అలమొనరింపఁబో నడి యూస యనుచు
మదినిఁబుయిలోడకుండఁ బల్కెదవు, నీకు
వెఱచి పఱచునే కర్ణుఁడు ల్లఱపుబిరుదు.

శల్యు:—అట్లయినచో నిక నా యాలస్యము లేదు. భీతిలకుండ ధైర్యముగ నుండుము.

గీ. పగ్గములఁబూని హరి వారు వములఁదోల
ప్రళయ పర్జన్య గర్జానుబంధముగను
దేవదత్తంబు పూరించి దిక్కులులియ;
వచ్చుచున్నాఁడ చూడు వి వ్వెచ్చు నేను.

పోరాడనిశ్చయించితి నేని నిస్సాణంబుమ్రోగించి సైనికులు యుద్ధమునకు సిద్ధముగ నుండునట్లు లాజ్ఞాపింపుము.

కర్ణ:—అయ్యది యెంతసేపు. (అని పరిక్రమించి) కౌరవ పృతనాధిపా!

మ. దళితానంతదిగంతమై, ధణధణాం ధాణాం ధణాధ్వానమై,
ప్రళయాభీల పయోదనిష్ఠుర రవ ప్రారంభసంరంభభృ
న్నిలయంబై, విజయాంకకర్ణయుగళీ విక్షోభ సక్షాంతమై
చలితారాతి వితానమైన, రణ నిస్సాణంబు మ్రోగింపుడీ.

శల్యు:—అహాహా! మహావీరశిఖామణివి. నిన్నుంబో.........

కర్ణ:—అధికప్రసంగముం జేయుదేని నీ నాలుక ఖండించెద. వేగమే రధముం ద్రిప్పుము. (అని నిష్క్రమించును.)

శల్యు:—వాగ్దానముం జేసిన వాండ నగుటచే నీయాజ్ఞ నుల్లంఘింపంజనదు. (అని నిష్క్రమించును.)



## తృతీయాంకము

స్థలము :—కురుక్షేత్రము. పాండవశిబిరప్రాంతము.

ప్రవేశము:—యుద్ధవేషమున—కృష్ణార్జునులు—ధర్మరాజు—

కృష్ణు:—(ధర్మరాజుంజూచి) బావా! నీయభిప్రాయము తెలిసినది- కర్ణునెదిరింపకుండ—ఒకప్పుడు కర్ణుం డెదిరింప వచ్చినను— తప్పించుకొని, యితరులసంహరించి విజయము బడయ వలెనని మనమెంత ప్రయత్నించినను ప్రయోజనము లేదు. కర్ణుండన్న నీకింత భీతియేల ?

ధర్మ:—కృష్ణా! కర్ణునకు భీతిల్లినట్లు నేనవరికిభీతిల లేదు—భీతిల్లను. భీష్మద్రోణాది వీరులు నిరుత్సాహముగఁ కర్ణుని నర్థరథు లలోఁజేర్చినను—యథార్థ మూహించిన కర్ణుఁడతి భయంకర వీరుఁడు—కౌరవరాజపక్షమున నిష్కపటముగఁ పోరాడి తనప్రాణములనైన ధారవోయుటకు సిద్ధముగనున్న వీర శిఖామణి—

ఉ. దుర్జయుఁడుగ్రుఁడాలమున ద్రోణుఁడు భీష్ముఁడు గాడు కర్ణుఁడ
త్యూర్జిత బాహువిక్రమము యుద్ధమునన్ ప్రకటించు మేటి, నీ
తర్జన భర్జనంబులకు ధైర్యముఁబాయని స్థైర్యమూర్తి; నీ
కర్జును నప్పగించితిని హానిఁదొలంచి యనుగ్రహింపవే ?

కృష్ణ:—(ధర్మరాజుతో) ఓహో! ధర్మరాజా! కర్ణుఁడనిన నీకింత భయమున్నదని నేనింతకుపూర్వమే తెలిసికొనియున్న—ఎట్లయినఁ కర్ణుని మనపక్షమునకు నాకర్షించియేయుందును.

ధర్మ:—కృష్ణా! నీతోఁజెప్పకేమి ?

ఉ. వెంగ జనించు డెందమున వీరుని కర్ణుని పేరువిన్న; న
య్యంగభవారి ఘోరనిట లాంబకతుల్యము వానిమోము చూ
డంగల వీరుఁడెవ్వఁడకటా! యని వానిజయించుటెట్లు? మా
యంగదనెట్లు బాపెదవొ యర్జును నేగతిఁగాచుకొందువో ?

కృష్ణ:—అర్జునా! విన్నావా? మీ యన్నగారి మాటలు. నిన్ను నే నెట్లు కాచుకొనఁగలను ?

చ. విడువఁడునిన్నుఁ గర్ణుఁడరి భీకరుఁడాజి నెదిర్చి యెట్టులేన్
పొడువకపోఁడు, మాగధుని పొంకమణంచిన యుక్కులుండువాఁ
డడలక నీవు కంటఁబడి నంతనె హుమ్మనిహుంకరించు; నె
వ్వడువననిన్నుఁగాచుకొన వచ్చునునాకు వచింపుమర్జునా ?

గుఱ్ఱములఁ గాపాడుకొనుచు నన్ను నేఁగాచుకొను నప్పటికే తలప్రాణము తోకకువచ్చును—వినుచున్నావా! అర్జునా? నన్ను—గుఱ్ఱములనీవు సంరక్షింప నవసరము లేదు— నిన్నునీవు కాచుకొని యుద్ధముఁజేసినఁ జాలును.

అర్జు:—కృష్ణా! నన్ను నీ వెఱుఁగుదువు. నిన్ను నేనెఱుఁగుదును—ఇప్పుడీ ప్రసంగముతో నేమిప్రయోజనము—

(తెరలో రణదుందుభి మ్రోగును)

అర్జు:—విన్నావా!

గీ. సమరదుందుభి మ్రోగించి సరభసమున
వచ్చెఁ గర్ణుండు; వ్యర్థ సంభాషణమున
నిట్లుకాలంబు వెచ్చింప నేల మనకు?
నేనెఱుంగని కర్ణుఁడా నిజము చెపుమ.

కృష్ణు:—ధర్మనందనా? నీ వింత భయపడ నవసరము లేదు. శల్యుని సాగత్యము—బ్రాహ్మణశాపము—కర్ణునకుఁ బ్రాణాపాయకరములు—ఇంతకు నీ తమ్ముఁడు తక్కువవాఁడా ?

శా. శంఖనాదము మాన్పి ప్రాగ్గగ ధను ష్టంకారముం జేయు శ్రీ
కంఠున్ దాకి జయించి పాశుపతమున్ గైకొన్నవాఁ డక్కటా
శుంఠున్ గర్ణునిఁ జూచి జంకు నె? మహా శూరుండు నీ తమ్ముఁడు
త్రుంచుం దక్కి యొకింత తాళుము భయోత్పాతంబు నీ కేటికిన్.

ముందు మేము వెడలుచున్నారము. వెంటనే భీముని—సాత్యకిని బంపుము........

(మువ్వురు నిష్క్రమింతురు.)

ఇది

# తృతీయాంకము.

# కర్ణ విక్రమము

## తురీయాంకము.



కురుక్షేత్రము. ప్రవేశము—భీముఁడు.



భీము:—"కర్ణునితో దృష్టద్యుమ్న సాత్యకిప్రముఖులుపోరుచుందురు. నీ వొకయోర దుశ్శాసను మార్కొని పోరుము. దుర్యోధనుఁడు వచ్చినచో నర్జునుఁడడ్డగించును. అశ్వత్థామ యుద్ధమునకు రానని ప్రతిజ్ఞఁ జేసెను. సులభముగ దుశ్శాసను వధియింపవచ్చు"నని శ్రీకృష్ణుఁడు నాకుఁదెలిపెను. (తెరవైపుజూచి) కృష్ణుఁడాజ్ఞాపించినట్టు లల్లదే, దృష్టద్యుమ్నుఁడు,సాత్యకియుఁ గర్ణునితో నతితీవ్రముగఁబోరుచున్నారు. ఇదియే మంచిసమయము. దుస్ససేనుని జాడయేనాకుఁ గనుపట్టకున్నది. ఓరీ! పశువా దుశ్శాసనా!

చ. కసికరమున్ దొలంగి సతి గాసిలఁజేసిన దుష్టచిత్త! నా
మనమున నాటుకొన్న యవమానము కౌరవ నాశనార్థమై
యనలము భంగిఁ బ్రజ్వలితమై కనుదమ్ములఁ, నెమ్మొగంబునన్
గనుపడి నిన్ను నొక్కత్రుటి కాలములో దహియింపకుండునే.

ఓ కౌరవవీరులారా! మీయువరాజెచ్చట డాగియున్నాడు? నేడు రణరంగము నలంకరింపఁడా యేమి ?

గీ. యమతనూజునాజ్ఞా శృంఖలముచే బద్ధ
మయ్యె భీమగజంబుచు నరసి నాఁడు
సభను చూపించె నసమాన సాహసంబు
నిపుడు రాడేమి ? నేడు విశృంఖలుండ.

ఓ కౌరవయోధులారా! మీరేడ పాండవులతో యుద్ధమొనర్చుటేడ. కురువంశము నశింపఁజేయుటకు నే నొకండఁ జాలనో ? మిమ్ముల మీసేని వధించుటకు నొక్క త్రుటికాలమైన నా కక్కఱలేదు. పాండవులనిన నల్పులని మీ రెల్లరుఁదలంచి కౌరవపక్ష మవలంబించిరేమి?

గీ. సింహశార్దూలములతోడఁ జెలఁగి హరిణ
కోటి పోరాటమును సల్పఁ గోరినట్లు
పాండవానీకములతోడ బవరమునకుఁ
గడఁగి మోహరించు తలంపు కౌరవులకు.

ఉ. శూరుఁడటంచు నించుకయు సూతజుగీతజు లెక్కసేయ, వి
స్తార బలాధికుండనుచు శల్యునిగల్యునిఁ గంటఁజూడఁ బెన్
దోరపు బల్లిదుండనుచు ద్రోణజుగీణజు సాటిసేయ, దు
ర్వారగదాహతిన్ గురు నృపాలునిఁ గాలుని బ్రోలికంపెదన్.

(అని తెరవైపుఁజూచి) హా క్రూరచిత్త! పాండవద్వేషి! ఇప్పటికి నాకంటఁ జిక్కితివిరా దుశ్శాసనా!

చ. నరపశు వెవ్వఁడాద్రుపద నందన కుందగఁ గొప్పుబట్టె; నా
కురుసభలో నెవాఁడు సతికోకలఁ గైకొనె; నట్టి క్రూరు హ్రా

త్సరసిజ శోణితాసవము ద్రావఁగనేను ప్రతిజ్ఞఁ గొంటి; నా
నెరసరి మన్మభుజద్వయవనిన్ బడఁబోవఁగలేరె కౌరవుల్ ?

ఇఁకనేఁ గాలము వెచ్చింపఁజనదు. అసహాయుండై చిక్కిన ధర్మనాశను దుశ్శాసను నిపుడే వధింప వలెను.

సీ. విదళిత విపులోరు హృదయ కటాహ ర
క్తౌఘవారిని స్నాన మాచరించి
వైరి భూధవరక్త వారి ధారాధౌత
కేతనాంబరములఁ బ్రీతిఁదాల్చి
భయద గదాహతి భగ్నీకృత లలాట
పట్ట రక్తము ఫాల పదవిఁదీర్చి
క్రూరబుద్ధి కపాల సారస సంభూత
రక్తమన్ మధు వను రక్తిఁద్రావి

గీ. దుస్ససేనుని మాంసంబుఁ దుష్టినార
గించి; మిగిలియున్నది కాక గృధ్రములకు
నామెతల నిత్తు; భయద సింహంబనంగ;
నన్యరాజన్యయముఁడనై జన్యముననుం

కౌరవవంశపాంసనా! నా బాహుపంజరమునకుఁ జిక్కి-యమునకుఁ దక్కితివిరా! (అని గదాదండముఁ ద్రిప్పుకొనుచు భీముఁడు నిష్క్రమించును.)

———

# కర్ణవిక్రమము

## కురుక్షేత్రము—కౌరవశిబిరప్రాంతము

(మూర్ఛాగతుండైన దుర్యోధనునితో సూతుఁడు ప్రవేశించును.)

సూతు:—అన్నప్రతిజ్ఞ కెక్కడ భంగము వచ్చునోయని యర్జునుండు శరపరంపరల వీరసందోహముపై వెదజల్లునపుడు మా రాజు తమ్మునిఁ బ్రోవఁబోవుతటి వాని క్రూర నారాచములకు మూర్ఛాగతుండయ్యె. ఇఁక భీముని యాటోపము నుడువవలెనా ?

ఉ. మన్నిగొనంగ వేపులను మాటికి వేఁటరి పంచినంత లా
వెన్నక పాఁడిగోళ్ల నధి యించుచుఁ గ్రొవ్విచరించునట్టి ము
వ్వన్నె మెకంబుచందము, నృపాలునిపంపున రేఁగు బంట్ల నా
పన్నురఁజేసి కచ్చియ నవారిత లీలనొనర్చె నుగ్రుఁడై.

భీష్మద్రోణ సైంధవాదివీరులు మున్నె గతించిరి. దుశ్శాసనుఁడు తన కనులయెదుట వధింపఁబడియె. ఇట్లయ్యుఁ గర్ణుఁడు తమ్ముఁ గాపాడఁగలఁడను నడియాస యెందులకో తెలియకున్నది. (అని దుర్యోధనుఁజూచి) పాపము. రాజరాజై సకలైశ్వర్యముల ననుభవించి పెక్కు సామంతరాజులచే సేవితుండగు నితఁడిట్టి యిక్కట్టులకుఁ బాల్పడియెను.

గీ. వీఁక మత్తిల్లి యేనుంగు మ్రాఁకు విఱిచి
నాకులన్నియుఁ ద్రెళ్లిన యటుల, గాఁపు
బిడ్డయన్ గౌరు కురువంశ వృక్షమడలఁ
గొట్టఁ గౌరవసంతతి కూలెనకట.

దుర్యో:—(మూర్ఛఁదేరి) తమ్ముఁడా! దుశ్శాసనా! భీతిలకుము.
ఇదే వచ్చుచున్నాఁడ.
సూతు:—మహారాజా! శాంతింపుము. శాంతింపుము.
దుర్యో:—ఓయీ! రథము రణరంగమునుండి తొలఁగించితివేల?
సూతు:—ప్రభూత్తమా! ఇంచుక తాల్మిఁబూనుడు.
దుర్యో:—ఓరీ! రాజద్రోహి!

గీ. పాండవాధముఁ డొక్కండు గండుమిగిలి
తమ్ముకుత్తును తెగటార్పఁ దలఁచునపుడు
నాదు గారాబుఁదమ్మునిఁ బ్రోదిసేయ
నేగు నన్ను నంకిలిసేయు దే దురాత్మ.

సూతు:—రాజాధిరాజా! నేను దురాత్ముఁడనే. యువరాజుగారు
వీరస్వర్గముఁ జేరిరి.
దుర్యో:—హా! తమ్ముడా! దుశ్శాసనా! మదాజ్ఞానువర్తీ!
సూతు:—దేవా! ఊరడిల్లుఁడు. గురుపుత్త్రుఁడదే వచ్చుచున్నాఁడు.
దుర్యో:—హా కురువంశవిభూషణా! సోదరరత్నమా! భీష్మద్రోణు
లడంగినను, సుతులు, చుట్టములు నశించినను, గెలువఁ
గల నను నాశావృక్షమునకు నీ కతనచలనము పుట్టినది
గదా! తమ్ముడా! ఇఁక రాజ్యమేల? యుద్ధమేల? హా!
సోదరరత్నమా! దళితరపుసేన! దుస్ససేన!
అశ్వ:—(ప్రవేశించి) జయము. జయము. మహారాజా!
సూతు:—(తనలో) వారువముల విశ్రమింపఁజేసెదఁగాక. (అని
నిష్క్రమించును.)

దుర్యో:— ద్రోణనందనా! ఇంకజయమేల ?

సీ. ఎవ్వనిపేర్విన్న నేడుసంద్రంబులు
జీవనంబులఁబాసి చెడి నశించు
నెవ్వనిఁగాంచిన ఋషులాదిదేవతల్
గడగడభీతిచే వడఁకువార
లెవ్వనిసభలోన నెదిరింపఁజాలక
భీముఁడంతటివాఁడు బెండువడియె
నెవ్వని బల్మికి నెంతటిఁజోదైనఁ
బిఱికితనంబున వెన్నుసూపు

ఆ. వె. నెవని బెట్టిదంపు రవలి పీనుల విన్నఁ
బాండురాజు సుతుల గుండె మండు
నట్టి నాదు తమ్ముఁ డట్టి గండుమగండు
దిక్కులేక నేడు తెగినవాఁడు.

అశ్వ:—రాజా! ఊరడిల్లుము. గతించినకార్యమునకు విచారించిన లాభ మేమి? తొలుతనే యుద్ధమువలదని పెద్దలు నుడివిరి గదా ?

దుర్యో:—హా! తమ్ముడా! మదాజ్ఞానువర్తీ !

సీ. కడిఁదిబొబ్బమెకంపుఁ గడిమిలావులమీఱఁ
గాఁజాలు కర్ణుండు ఘనబలుండు
సాణుని దీర్చసి ద్రాణుఁజేయఁగలట్టి
గురుతనూజాతుండు గురుబలుండు
క్షాత్రవకాంతార సంహారఖేలనా

యత్తచిత్తుఁడు కృపుం డధికబలుఁడు
కొండలన్నియు గుండ పిండిసేయగనోపు
శల్యుండు శత్రుహృ చ్ఛల్యసముఁడు
అ. సమదగజసమాన సత్వమూర్తివి నీవు
పోరి యుసుఱుఁగోలు పోవుటఱయఁ
గంజభవునివ్రాత కారణంబగుఁగాక
గాలిచూలి బలిమి కారణంబె.

అశ్వ:—రాజా! ఎవరున్న నేమి? కాలధర్మము మీఱ నెవ్వనితరము. మిగిలినవారిఁ జూచియైన సంతసింపుము.

దుర్యో:—ద్రోణనందనా! మిగిలినవా రెందరున్నను నా కేల?

గీ. ఘనతరంబగు నుద్యాన వనమునందు
నెన్నియున్నను వృక్షంబు లేమిఫలము?
సౌరభంబున సకల ది క్చయమునించు
స్థల కమల మొక్కఁడేనియుఁ జాలదొక్కొ.

అశ్వ:—రాజా! విచారించిన లాభ మేమున్నది? నా పలుకులాలకించిన బాగుపడియెదవు. కర్ణుఁడు నినుఁ బ్రోవఁజాలఁడు.

దుర్యో:—నన్నుఁ బ్రోవఁజాలఁడా? ఏమనియెదవు?

అశ్వ:— అనుట కేమున్నది? నాపలుకులఁగల నిజము గ్రహింపకుంటివి. అందులకు విచారింపుచుంటివి. మన్మనోభిప్రాయముఁ బూర్ణముగఁ దెలిపెద వినుము.

శా. ఆవాచాలుని కర్ణు నమ్మికొని బా హాటంబుగా నీవు పెన్
జేవల్ లావులఁ గల్గు పోటరివలెన్ జృంభించి గర్వించి రా

కేవింజూపినఁ గేడుమూడు ననిఁ షో టిన్ బోరు బొలెవ్వఁడీ
వా?వాడా?యెవఁడోపుఁ గ్రీడిఁదునుమన్ బ్రారూఢిగందెల్పుమా.

దుర్యో:—నిరుత్సాహంపుఁబలుకుల నీవెన్ని పలికినను సూదిమోపు
నంత నేలనైనఁ బాండవుల కీయఁజాలను. పితార్జితమైన
రాజ్యమును పాండవుల కెట్లొసంగఁగలము.

అశ్వ:—ఒసంగుటకు మానుటకు నీవెవండవు. ఇట్లు పలికినవార
లనేకులు గలరు.

ఉ. ఆరయ నెందఱొందరు ధ రాధిపు లేలి నశించియుండ రీ
ధారుణియెల్ల నొక్కనికిఁ దక్కెనె? యెయ్యది శాశ్వతంబు? ని
ష్కారణ వైరమూని యనిఁ జచ్చుటయే ఫల మొందుగాక, దు
ర్వారబలాన్వితుండెవఁడొ వాడె సమస్త ధరాధినాథుఁడౌ.

దుర్యో:—ఆఁ ఏమీ? కురురాజ్యరమానాథుఁడగు దుర్యోధనుఁడా
నశించునని పల్కెదవు.

అశ్వ:—అట్లునేఁబలుక [illegible]నా? లోకనైజముఁ దెలుపుచుంటిని.

ఉ. "ఏను బలాన్వితుండను మ హీస్థలినెల్లను నేన యేలుదున్
గాని యొకండు నన్ను నరి కట్టఁగజాలఁడు; నా పురంబునన్
భానుఁడు గ్రుంకఁజాలఁడ"ను పల్కులఁబల్కిరి రాజులెందఱో
మానవనాథ! యీదురభి మానముతోఁ బనియేమిచెప్పుమా.

దుర్యో:—గురుపుత్రా! రాజద్రోహమునకుఁ బాల్పడుచుంటివా?

అశ్వ:—రాజద్రోహ మిందేమున్నది. నీమేలు గోరువాఁడఁ గాన
మంచిచెడ్డల నెఱుఁగఁజెప్పితిని. కర్ణుఁడు పలికిన పలుకులఁ
బట్టియా సాహసించుచుంటివి.

చ. అఱచెడి వెట్టిబీరముల యందుఁగలట్టి నిజంబుఁగల్ల నీ
వెఱుఁగవుగాక; సూతసుతుఁ డెట్లనినం దలయూతు వారగ! ప
ల్లఱపులు నిక్కవంబుగ జ యంబొనగూర్చునె? రజ్జులాడినన్
వెఱచెడు వాఁడె ఫల్గుణుఁడు వెంబరవిత్తులు నీవుఁ గర్ణుఁడున్.

దుర్యో:—నాకు గర్భవైరులగు పాండవులతో నెట్లు చెలిమి వాటిల్లు
నని నీ వూహించుచుంటివి. ఇట్టిపలుకులవలన లాభ మే
మున్నది.

అశ్వ:—రాజా! నీకు సోదరులగు పాండవులు గర్భవైరులా ? ఎట్టి
సంబంధము లేని కర్ణుఁడాప్తుఁడా? ఏమి యీ విరుద్ధాభి
ప్రాయము.

ఉ. బద్ధవిరోధు లెన్నఁదగుఁ బాండవులంచుఁ దలంచి, కార్యసం
సిద్ధియొసర్పఁగాఁదగిన స్నేహితుఁ డాప్తుఁడు కర్ణుఁడంచు ద
ర్పోద్ధతి సాటియెవ్వరని యున్నతినుండెద వీవు; కర్ణుఁడున్
యుద్ధమునందుఁజచ్చిన సు యోధన! సాధనమేమి చెప్పుమా.

దుర్యో:—(విననియట్లు నటించి తెరకైవెపుఁజూచి) ఎవఁడురా
యచ్చట ?

సూతు:—(ప్రవేశించి) ఏమియాజ్ఞ ?

దుర్యో:—రథము యుద్ధమునకు సిద్ధమగుఁగాక.

సూతు:—అమోఘము రాజాజ్ఞ. (అని నిష్క్రమించును.)

అశ్వ:—రాజా! నేఁ జెప్పునది బాగుగ నాలోచించుకొనుము. నీ
కుపదేశించుట దోషమని యెఱుఁగుదు. పాముకుఁ

బాలు విషవర్ధనమన్నట్లు సజ్జనోపదేశమున మూఢుఁడు ప్రకోపించుఁగదా ? (అని అశ్వత్థామ నిష్క్రమించును.)

దుర్యో:—ఈ పలుకులకు దుర్యోధనుఁడు భీతిలునా ? వైరుల వధించి సామ్రాజ్యవైభవములఁ బడయఁదలఁచుట నృపుని స్వభావముగదా? యుద్ధక్రమ మెట్లున్నదియుఁ బరీక్షించెదఁగాక. (అని నిష్క్రమించును.)

---

## రణరంగము.—కురుక్షేత్రము.

---

(దుస్ససేనుని శిరముఁ దొడపై నిడి కర్ణుఁడు విచారించుచుండును. శల్యుఁ డోదార్చుచుండును.)

కర్ణు:—ఈ మృతకళేబరముఁ జూచుటకు నాకను లెట్టి పాపంబుఁ గావించెనోగదా? హా! దుశ్శాసనా!

గీ. అప్రతిహత సుప్రతాపంబు సుప్రసిద్ధ
శౌర్య గాంభీర్య బలసాహ సములఁగలుగు
నీవు లేకుంటఁ గురువాహి నీ గణంబు
లోపముంజెందె నధిక సంతాపముునను.

శల్యు:—పాపము! నీ విట్లుచింతించిన లాభమేమి? చచ్చినవారలు లేచి వత్తురా? కాలము విషమించినది.

కర్ణు:—హా దుశ్శాసనా! నీవు చచ్చిపడియుండుటఁ జూచుచున్న యీ కన్నులు నన్ను మోసపుచ్చుచున్నవి.

గీ. చచ్చిపడియుండుటద్ది నిశ్చయమయైనఁ
జూచుచున్నకొలంది నా చూడ్కి నన్ను
మోసపుచ్చెడి; బమ్మెర పోయెబుద్ధి;
లెమ్ము నేను కర్ణుఁడఁ గాగి లెమ్ముసఖుఁడ.

శల్యు:—కర్ణా! సైన్యాధిపతివయ్యు నీవు చింతించుచున్న, మిగిలి యున్న సైన్యము దైన్యముఁజెందును. యుద్ధమునఁ జచ్చిన వారిఁగూర్చి దుఃఖించుటయా కర్తవ్యము?

కర్ణు:—మద్రినాథా! మఱి యుద్ధమెందులకు?

మ. కలయో నిక్కమో వచింప నరుదై కన్పట్టె; నా కెయ్యెడన్
చెలియై చుట్టముకన్న మిన్నయయి సుశ్రీరాజ్యభోగంబులన్
గల దుశ్శాసనుఁడిట్లు చచ్చిపడియుంటం గాంచితిన్ గ్రుక్కితిన్
పాలుపుందక్కితి నెట్లుపోరుదు ద్విభూతాంత రంగుండనై.

శల్యు:—విచారింపవలసినదే. ఎవరుఁ జావకుండ యుద్ధముఁ జేయఁ గలమా? చచ్చినవారిఁగూర్చి విచారించుచున్న లాభ మున్నదా? నీ వేడ్పు చాలించి వేగమేరమ్ము. నేను దుర్యో ధనుఁ జూడవలయు. (అని శల్యుఁడు నిష్క్రమించును.)

కర్ణు:—అవునవును. లాభ మేమున్నది. సర్వము సూన్యము. నా జన్మమే సూన్యము. చచ్చిచెడి యుద్ధముఁజేసి గెలిచిన నానందించువార లెవరు. భార్గవుని శిష్యుండనై, విజిత జరాసంధాది వీరుండనై, విజయధనుర్ధరుండనై, దుర్యో ధను నంతటివానికి మిత్త్రుండనై, కౌరవసేనానాయకుండనై

యుండియు, మానవాధముఁడొకండు, దుశ్శాసనుఁ జంపెఁ గదా! హా క్రూరా! వాయునందనా! నే లేనిసమయంబునఁ జంపిన నిన్నుఁ గర్ణుండేమిచేయునో గ్రహింపకుంటివిగా ? నేఁజేసిన యుపకారమునకుఁ బ్రత్యుపకారము బాగుగఁ జేసితివి.

చ.మునుపొకమారునిన్ను నొక ముల్కి-నిఁగొట్టి రథాశ్వసూతులన్
మనియలఁజేసి కేశనముఁ దుంచిన నీవు జణింగి పంద వై
యనినొక యోరడాఁగు సమ యంబున నీదరిఁజేరి యింటికిన్
జనుమని బోఁచినాడ నది నాయెడ నిర్వ్యథిఁ గీడు మూడెఁబో.

హా! దుశ్శాసనా! నినుఁజంపినవాఁడు కర్ణుఁడుగాని భీముఁడు గాడు. చేతికిం జిక్కి-నాడె యా కృతఘ్నునిఁ జంపితినేని నీవు చచ్చియుందువా ?

మ. నదిపుత్త్రాదిమహారథుల్ వివిధ సేనానాయకుల్ నన్ను నె
ల్లిదముం జేసినఁ గోపభార వహనక్లేశంబు నెమ్మోమునం
గదురన్ వారల నీసడించిన నినుం గాపాడ లేనైతి; నా
కిదియేనా కడసారిచూపు విధినే నేమందు దుశ్శాసనా.

మ.నదిపుత్త్రుండు,ఘటోద్భవుండు,హరునైనన్ మీఱు దోస్సార సం
పద చేఁ గ్రొవ్విన వీరులయ్యును సుహృ ద్వాత్సల్య మేపార నా
కదనంబే హాభాగులంబొగడు నిన్ గాపాడ లేనైతి; నా
కిదియేనా కడసారిచూపు విధి నే నేమందు దుశ్శాసనా.

మిత్రమా! దుశ్శాసనా! ఇదియే కడసారి కౌగిలి. ఇదియే నా కడసారి చూపు. (అని లేచి ధనుస్సుఁబూని)

గీ. ప్రళయపర్జన్య ముక్త నిర్ఘాతసంఘ
సదృశపుంఖానుపుంఖాస్త్ర సంచయ దళి
తారి కదళికాషండ సంహారఖేల
నంబుఁ జూపెద నిష్పాండ వంబుగాఁగ.

(అని తెరవైపుఁజూచి) ఓ పాండవయోధులారా!

శా. వ్రీడం గైకొని డాఁగిరో పఱచిరో భీతిల్లిరో నేడు పో
రాడంజాలరో? నేను లేని తఱి ర క్తౌఘంబులం ద్రావి జ
ల్లాడంజాలిరె? చక్రి సంతసిలెనే యాశాశ్య మీఁడేరెనే
ఏడీ భీముఁడు వాని తమ్ముఁడు నరుం డేడీ విలోకింపరో.

(అని విక్రమించును.)

---

పాండవశిబిరప్రాంతము

ప్రవేశము.—కృష్ణార్జునులు.

---

అర్జు:—కృష్ణా! రణరంగముఁజూడుము. ఎన్నఁడులేని సంక్షోభము నే డుండుటకుఁ గారణము దుస్ససేనుఁడు వధింపఁబడుటయే. అహో! ఎంతభయంకరముగ నున్నది.

మ. ఫణిరాడ్గ్రీవ విలోచనానలశిఖా ప్రద్యోతమై పౌర్ణిమో
ల్బణకూపారసదృక్షమై ప్రళయవేళాలోల భూగోళమై
గుణరావాన్విత రోదసీకుహరమై కోలాహలోద్వేలమై
రణభూభాగముఁ జెప్పనొప్పెఁగడు గర్జత్ప్రమత్తాలావర్తమై.

## కర్ణవిక్రమము.

కృష్ణు:—కర్ణుని యాటోపమే యీ కోలాహలంబునకుఁ గారణము. ఆకసము కనంబడకుండఁ జేయునవి కర్ణునిబాణంబులే సుమా?

గీ. కుండలీకృతచండ కోదండ కాండ
ముక్తనిర్గత శరగణం బులను వైరి
భూధవమహో మహోగ్రాగ్ని పొలుపు సెడగ
జేయుచుండెఁ గర్ణుండు వి జృంభణమున.

అర్జు:—అన్నగారి సేమంబరయుటకుమున్నె కర్ణుని పెంపణంచుటయే కర్తవ్యమని నాకుఁ దోచుచున్నది.

కృష్ణు:—అట్లొనర్చుటయు లెస్సయే. కర్ణుని యునికిఁ గనుంగొనుము

అర్జు:—(నలుదిక్కులఁజూచి) అహాహా! కృష్ణా! చూచితివా కర్ణుని భీకరాకారము. భయముగొలుపుచున్నది.

మ. ప్రళయార్కోదయకాలమై వెలిఁగె నేత్రద్వంద్వమాస్యంబు ప్ర
జ్వలితంబై బహు భీకరంబయి యవాచ్యంబైప్రకాశించె దృ
ష్టులు బాణంబులు మూక నొక్కటఁ దోఁచెం జూడు; నౌరౌర! నా
తలమా చూచి వచింప నంగవిభు దుర్ధర్ష ప్రతాపోన్నతిన్.

అహా! కృష్ణా! అది ముఖమండలమా? లేక యగ్ని కుండమా? ఔరా! చూచి వచింప వేయికనులు చాలివచ్చునా?

సీ. ఆతపప్రస్ఫోటి తాఖిల క్ష్మాధర
మధ్యాహ్న మార్తాండ మండలంబొ
బహుభీకరానల పాషాణ ఖండిత
బ్రహ్మాండభాండాగ్ని పర్వతంబొ

## కర్ణవిక్రమము.

ఆత్మభూ హరణార్థ హరనయనోద్ధూత
కీలి కీలాకలా పాలయంబొ
కబళితాఖిలజీవ కల్పాంత మృత్యు భీ
షణకాలఫణి ఫణా మణిగణంబొ
గీ. ఘనగుహాతుల్య వివర భీ కర శతఘ్ని
కా వినిర్గత తత లోహ కందుకంబొ
యనఁగ దుర్నిరీక్ష్య ప్రతా పాధికమున
వర్ణనాతీతమై యొప్పెఁ గర్ణుముఖము.

కృష్ణు:—అర్జునా! నెవ్వెఱ పాటొందుచున్నావేమి ?
అర్జు:—కృష్ణా! కర్ణునిఁజూచి మాటలాడుము.

గీ. భయదసంవర్త పావక జ్వాలలనఁగ
సంజకెంజాయ రంజిల్లు చక్షువులను
యముని దంష్ట్రలఁబోలు బా ణములఁ బూని
వచ్చెఁ గర్ణుండు దురము దు ర్భరము కరము.

కృష్ణు:—అర్జునా! నీవు విజయుఁడవే ? సందియముఁ గొల్పుచున్నది.
కనులార నీ మొగముఁ జూడనిమ్ము.

చ వెరవున శర్వునింగెలిచి భీష్ముని బల్మినిఁగూల్చి ద్రోణు సం
గరమున నోర్చిపేర్చిన మగండ బలుండ నటంచు నీవు పెన్
గరువముఁబూను లావరివి కర్ణుని మోమునుగాంచి పంద వై
పరువిడి పోదలంచెదు సె బాసు! బృహన్నల!నిన్ను మెచ్చితిన్.

ఇంతియగాక నీవు పులుకునది సహితము యోగ్యముగా నున్నది. అపజయము వాటిల్లునని గ్రహించియుఁ బోరఁదగదు. (ప్రోత్సాహముగ)

గీ. ఫాలనేత్రంబు తెఱచిన ప్రళయకాల
కాలకంఠుని వలె నేడు కర్ణుఁడదిగో
వచ్చియున్నాడు నీశక్తి పసికిరాదు
రథముఁ ద్రిప్పెద మృత్యుకా రణము రణము.

అర్జు:—కృష్ణా! పందననుకొంటివా యేమి? సరియే. యుద్ధమునకు రథముఁ ద్రిప్పుము. నీవు మెచ్చుకొనునట్లు కర్ణుని మోహరించెద.

కృష్ణు:—(ప్రోత్సాహముగ) వలదు. వలదు. అంతటిసాహసంబున లాభమేమి ?

గీ. తొలుతఁ జాకున్న నావల గెలుపుమాట
చూచుకొందము డెందము సూటిపఱచి
రథముఁ ద్రిప్పెద నర్జునా ప్రాణమున్న
వనమునందైన నివసించి బ్రదుకవచ్చు.

అర్జు:—కృష్ణా! పోరాడుటకు దేశకాలపాత్రముల నెఱుంగవలదా. కర్ణునిచే నవమానింపఁబడిన యన్నగారి సేమం బరసివచ్చి పోరాడవలెనని నా యభిప్రాయము. ఎఱిఁగి యుండియు నిట్లు యుక్తాయుక్తము లరయకున్నందులకు విచారించు చుంటిని.

కృష్ణు:—అర్జునా! యుక్తముగానే పలుకుచుంటి. ఇందయుక్త
మేమున్నది.

చ. కొలువుననాడు సూతసుతుఁ గూల్చెదనిశ్చయమంచు ద్రోణ భీ
ష్ములు వినుచుండ గాండివముఁ బూని వచింపవా? రిత్తపల్కులన్
బలికితొ? నీదుజిహ్వ బహు భాషలనేర్చెనొ? త్రుప్పువట్టెనో
ములుకులు? మేలు! మెచ్చఁదగు పోటరివౌదువు మాట లేటికిన్?

అర్జు:—కర్ణునిఁ జంపఁజాలననియంటినా? లేక భీతిల్లుచుంటినా?
అనుచితములనేల భాషించుచుంటివి?

కృష్ణు:—అర్జునా! కర్ణునిఁ జంపెదనని పలుకుచుంటివే-అల్పుఁడనియా
నీ యభిప్రాయము.

చ. అతఁడలసుండుగాఁడు, శిరమందు శిరోజములెన్నొ, యన్ని పో
రితముల నాఱితేఱిన గరిష్ఠుఁడు; వీరులలో వరిష్ఠుఁడ
ప్రతిహత వీరుఁడాతని శరంబుల కుల్లముతల్లడిల్లె; నో
ర్పితిఁ బరికించితిన్ సమరరీతి; గ్రహించితి నీదుచేవయున్.

సీ. భక్తవత్సలుఁడైన ఫాలాక్షుతోఁ బోరి
గెలుపొందుటది యొక గెలుపు గాదు,
సుతుఁడంచు వెనుదీయు సురనాథుతోఁ బోరి
జయమందుటది యొక జయము గాదు,
పక్షపాతముఁ బూని వచ్చిన భీష్మునిఁ
గూలఁద్రోయుట యది గొప్పగాదు,

కర్ణవిక్రమము.

కూర్మశిష్యుఁడవంచుఁ గొనియాడు ద్రోణుతోఁ
బోరాడుటది యొక పోరుగాదు,

గీ. మగధదేశాధిపుని గెల్చి మాలినీపు
రంబుఁ గానుకగాఁ గొన్న రాజవరుని
విజయకోదండ ధిక్కృత వీరవరుని
కర్ణుని, జయింపఁబొమ్ము ప్రఖ్యాతిఁగొమ్ము.

అర్జు:—కృష్ణా! ఏమనుచుంటివి? కర్ణుని జయింపఁబొమ్ము ప్రఖ్యాతి గొమ్మనియా? అయ్యది నాకు ఘనముగాదు. కర్ణుఁడనిన నాకొక లక్ష్యమా?

గీ విజయనామాంకితుఁడను విబుధ వినుత
సత్వముంగల వీరుండ సవ్యసాచి
నరి నృపాల కర్ణజ్వర మైన దేవ
దత్తమున్ విన గర్ణుఁడెంతటి ఘనుండొ?

కృష్ణు:—అర్జునా! అన్న సేమంబరసివచ్చి పోరాడెదనని యంటివే. అప్పుడీకర్ణుఁ డేమగును?

అర్జు:—భగ్గునమండుచున్నయగ్ని కాలక్రమమున శిశిరస్వ భావముఁ జెందకుండునా ?

కృష్ణు:—అట్లనా? సరియే. మీ యన్ననుఁ గాంచివచ్చి పోరుటయు లాభకరమే? నీ యభిప్రాయముతో నేకీభవించితిని. రమ్ము పోవుదము.

(ఇరువురు నిష్క్రమింతురు.)



# కర్ణ విక్రమము

## పంచమాంకము.

పాండవ శిబిరము.

విచారముతో ధర్మరాజు ప్రవేశించును.

ధర్మ:— నేననుకొన్నట్లయినది. ద్రోణభీష్మాదివీరుల భయము నా కించుకంతయు లేకున్నను కర్ణుని భయమొండు నన్ను బాధింపుచుండెడిది. వనవాసంబుననుండు సమయమునఁ గర్ణునిభీతిచే నిద్రాహారంబులులేక కృశింపుచుండెడివాఁడను. కురుసేనాంగ వనప్రదేశమునఁ గౌరవ క్రోడములను బరిమార్పఁదలంచు మాకుఁ గర్ణహర్యక్ష మెదురగుచున్నది. కర్ణుఁడు నాకొనర్చిన యవమానము మఱచెదనన్న మఱపు నకు రాకున్నది. జయము సంశయము. కీడు నిశ్చయము.

మ. ఉదిలంబింతయు లేని కర్ణుఁడు సదుద్యోగంబు నందుంటచే
నెదిరిన్ గెల్చుటచాలదుస్తరము, శ్రీకృష్ణుండు మా పార్థునిన్
గదనక్షోణినిఁ బ్రోవఁగాఁగలఁడె? కిం కర్తవ్యతా సంశయా
స్పదచిత్తంబునఁ దల్లడిల్లెదను నా ప్రారబ్ధ మెట్లున్నదో.

కర్ణుండు సైన్యాధిపత్యము వహించినప్పటినుండియు నా

చిత్తక్షోభ మింతింతయని వచింపవలనుపడదు. మీఁదు విచారింపక యుద్ధకార్యభారము వహించితి.

చ. చులకనఁజేసి కౌరవుల చొప్పెఱుంగగలేక బేలనై
తలఁచితిఁగ్రూరకౌరవ శతంబును యుద్ధమునన్ వధింప నా
కలవియె యద్రి! వట్టి యడియాసయటంచు నెఱింగితిన్ సుప
ర్వులకు నజేయులైనకురు భూపతులన్ బరిమార్పశక్యమే ?

మున్నిట్టిపాటు పాటిలునని విచారించియున్న సౌఖ్యముగ వనమునందు కాలంబు పుచ్చియుందును. ఇపుడిట్లు విచారించుట జనుల నైజమేగదా ?

గీ. స్వీయ బలసాహసంబుల విశ్వసించి
శత్రువులు స్వల్పులనియెంచి సమరకార్య
భారమువహించి పోరాడి బాధలొంది
కందుటది నైజమయ్యె లోకంబునందు.

సేవ:—(ప్రవేశించి) జయము. జయము. మహారాజా ? వాకిటఁ గృష్ణార్జునులు వేచియున్నారు.

ధర్మ:—సత్వరమే వారలఁబ్రవేశపెట్టుము.

సేవ:—రాజాజ్ఞ (అని సేవకుఁడు నిష్క్రమించును.)

ధర్మ:—కృష్ణార్జునులు కర్ణునిఁబరిమార్చి యుందురని తోఁచుచున్నది. అంతటి యదృష్టము నాకుఁజేకూరునా? శ్రీకృష్ణుఁడుండగా నంతటి యదృష్ట మేలవాటిల్లకుండును. ... ...
.... .... ... ....ఏమినావకాశ్యము.

## కర్ణవిక్రమము.

గీ. కర్ణునిబలంబు విక్రమ క్రమమెఱింగి
యున్నమది వాని వధ విన నుత్సహించుఁ
దనదుబలహీనత నెఱుంగఁ దలఁపదయ్యొ
నాశయనునది బుద్ధి జాడ్యంబుగాదె.

ఇంతియగాక యితరసహాయ మపేక్షించి యుద్ధభారము వహించినమాకు నష్టంబుదక్క లాభమెట్లుండును.

గీ. కృష్ణుఁడున్నాఁడు మున్ను! మా కేమిహాని
యనుచుఁదలఁచితి వైరంబు నల్పముగను
తలకుఁదాకకుండిన నేమి తెలియదనెడి
యార్యవచనంబు సార్థక మయ్యె నేడు.

(కృష్ణార్జునులు ప్రవేశించి) కౌరవసామ్రాజ్యలక్ష్మీ ధురంధరునకు జయంబగుఁగాక.

ధర్మ:—(సంతోషముతో వారల నెదుర్కొని)

గీ. క్రూరకౌరవ వీరసంహారకార్య
భారమువహించు మీరలు భండనమునఁ
గర్ణునివధించినారె! నిక్కంబుఁదెలిపి
క్లేశము డొలంగ ననుఁ గౌగిలింపుడిపుడు.

కృష్ణు:—(తనలో) కర్ణుఁడు వధింపఁబడెనని యీతని యభిప్రాయము. (ప్రకాశముగ) రాజా! కర్ణుఁడే చచ్చెనని చెప్పనేల! ఏనాడుమీపైఁ జెలరేగిరో యానాడే కౌరవులెల్లరుఁ జచ్చిరని యనుకొనుము.

అర్జు:—(తలవంచుకొనియుండును)

ధర్మ:—కృష్ణా! కర్ణుఁడొనర్చిన యవమానము మఱచెదనన్న మఱపునకు రాకున్నది.

కృష్ణు:—ఏమీ! ఆమూర్ఖుఁడంతటి యవమానమొనర్చెనా ?

ధర్మ:—ఒనర్చెనాయని ప్రశ్నింపుచుంటివా! ఏమనిచెప్పువాఁడ!

చ. సురలకునైన దుర్భరము సూతతనూభవుఁ డ్రుంప నమ్మమిా
పిఱికితనంపు డెందమున భీతిలుచుంటిని పెంపుఁదక్కి, నన్
దురమునఁగ్రూరభల్లముల దుమ్ములుచిల్లులువోవఁగొట్టె; శ్రీ
హరునిపదంబులాన నిజ మాడెదఁగల్లవచింప శ్రీహరీ.

అర్జు:— ( విచారముతో ) నే బ్రదికియుండియు మీకుఁగష్టముఁ జేకూర్చితి. కర్ణునిఁదాకఁబోవుతఱిఁగర్ణ కఠోరముగ నీ ఘోరవార్తవిని మీాసేమమరయవచ్చితిని.

ధర్మ:—ఛీ ! ఛీ ! అర్జునా! కర్ణునిఁబరిమార్పకుండ నాసేమం బరయ వచ్చితివా! కర్ణునిఁ జంపనీతరమౌనా! మున్నె మనలనందఱ నాతఁడోడించె. క్షత్రియుండవై యుండియు వైరినిర్జించుటయో ప్రాణంబుల విసర్జించుటయో యొప్పుఁ గాని సిగ్గులేక ననుఁజూడవచ్చితివేమి ? అట్లయినఁగర్ణునిఁ జంపుకార్యభారము నేనే వహించెద.

ఉ. ఆలమునందుఁ గర్ణుని బృహన్నలయా వధియించు శూరుఁ డౌ
రా? లయకాలరుద్రునయ నాగ్నికణంబులభాతి, మృత్యుదం

ష్ట్రాశిఖివిధంబు భీకరమ దస్త్రపరంపరఁ గుప్పింపఁ గ్రమ్మరించి, నేఁ
గాలుడనై వధించెదను కర్ణ సుయోధన దుష్టయోధులన్.

(తెరవైపుఁజూచి)

మ. ఎదసంతోషముబూనవేమి! భయమేలే ద్రౌపదీ! యర్జునుం
డెదిరిన్ గెల్చుట చాలదుస్తరము? శ్రీ కృష్ణుండుచక్రంబునన్
గదనంబున్ బొనరింపనేల! విను నీ కష్టంబు గట్టెక్కనే
డిదె జృంభించెద సూతజాదిరిపులన్ హింసించెదన్ ద్రుంచెదన్.

గాండీవగదాదండ చక్రంబులవిశ్వసించి తెచ్చుకొన్నది చాలు. పరులతోనేమి ! (అని కృష్ణార్జునభీముల నుద్దేశించి)

శా. గాండీవంబొకకేలనేల నర చక్రంబేలకృష్ణా ! గదా
దండంబేటికిభీమ! సంగరమునన్ దర్పాంధులన్ వైరులన్
ఖండింతున్ వెనుదీయకిప్పుడ భుజా కాండద్వయాలంకృతో
ద్దండాఖండధనుర్విముక్తశరసం తానంబునన్ జూడుడీ.

కృష్ణు:—రాజా! మేమిచ్చటికివచ్చుట నీసేమంబరయు తలంపుగాని మఱియొండుగాదు. నీవిట్లు కోపించిన లాభముండునా!

గీ. శౌర్యమునఁ దత్తరిల్లినఁ గార్యమగునె !
నక్కయా కుక్కయా కర్ణు నుక్కడంప !
వ్రేల్మిడింజంపఁదరమె యా వీరవరుని
నోర్మివహియింపవలెఁగాక ధర్మరాజ.

ఇంతియగాక కర్ణునిఁజంపుటకుఁ గృష్ణార్జునులు చాలకున్న నితరుఁడెవ్వఁడు సమర్థుఁడగును!

ధర్మ:—అట్లయినచో నీకష్టమొందులకు!

చ. అలమొనర్చెదన్ విజయ మందెదనంచువచించుఁగిరీడి! పాం
చాలికపల్కులతోఁ బరాభవనముతోఁ బనియేమి మాధవా
చాలునురాజ్యకాంక్ష; కడు సంతసమొందెదలేకయున్న ? ని
ర్మాలముగాకయున్నెకుల మున్ బలమున్ గలబంధుకోటియున్.

అర్జు:—అన్నయ్యా! తప్పులన్నియు సైరింపుము. కాలముఁబట్టి గదా కార్యములు చక్కఁబడును. భీతిలి డాఁగుటకు వచ్చితినని నీవు తలంపకుము.

ధర్మ:—అర్జునా! ఎందులకీ ప్రగల్భములు ?

గీ. ద్రోణుఁడో భీష్ముఁడో సురేంద్రుండొ సైంధ
వుండొ భక్తవత్సలుఁడొ ? కర్ణుండెవండు ?
కురునృపాలుని ప్రాణస ఖుండతండు
కృష్ణ సాహాయ్యమున్న నిర్జింపఁ గలవె ?

కృష్ణు:—కర్ణుఁ డెట్టివాఁడైనఁ జావకుండునా! నీవధైర్యముఁ బూని నందులకు మేమేమిచేయఁగలము.

ధర్మ:—కృష్ణా! ఇంతధైర్యము వహించుటకు వహింపకుండుటకు నేమున్నది. కర్ణుఁడు వధింపఁబడెనేని రాజ్యమువచ్చును అట్లుకాకున్నఁ గానలకేగెదము. ఇంతకు నితరుల నేల దూషింప వలెను.

మ. మును నేఁ జేసిన కర్మకుం దగుఫలంబున్ దక్క యన్యంబుఁ గో
రినఁ జేకూరునె! షండవై నరుఁడువై రిం జంపలేకున్నచో

ననఘా! కానలు లేవా కో; విధి బలీయంబన్న లోకోక్తి యం
దనృతంబుండునె? మాకు నీదగు సహాయంబున్న లేకుండినన్.

కృష్ణు:—(రహస్యముగ ధర్మరాజుతో) అర్జునుఁడు ఖిన్నుఁడై చింతిలు
చున్నాఁడు. వానికి ధైర్యముగఁ బలుకకున్నఁ గార్యము
విషమించును. ఇప్పుడైన శాంతింపుము.

అర్జు:—అన్నయ్యా! త్రిమూర్తులుఁ బోరవచ్చినను భీతి లెడువాఁడఁ
గానని యెఱింగియు నిట్లు పలుకఁజెల్లునే!

ఉ. చేతమునందు వాక్కులను చెయ్వులఁ బోరితమన్న నెట్టిదో
భీతి యెఱుంగఁ బాపమను భీతియ దక్క! విశేషరోషసం
భూతకుతూహలంబునను పోరి శచీపతి మెప్పుఁ జెంది యా
శీతనగాత్మజాధవుని చే వరమున్ శరమున్ గ్రహించితిన్.

(ఇంతియగాక)

చ. తరుణముగాంచి శాత్రవుల దాకి జయించుట రాజనీతి; సం
గరమున నెన్నిసారు లల కర్ణుని నేను జయింపలేదు? సు
స్థిరమతిఁ గోపమున్ విడిచి ధీరుఁడవై తలపోయు మెన్నఁడేన్
పరులకుజంకి పందవలె వచ్చితినే యవివేకమేటికిన్.

అసహాయశూరుండగు నర్జునునకుఁ గర్ణుడన్న నొకలక్ష్యంబు
గాదు. కాలముఁజూచి కర్ణునిజయించెద. శాంతింపుము.

ధర్మ:—ఈ పలుకులవలనఁ బ్రయోజనమేమి?

## కర్ణవిక్రమము.

కృష్ణు:—రాజా ! అజాతశత్రుఁడు యుధిష్ఠిరుఁడవు. తాలిమిఁ బూని యుండుము.

ధర్మ:—తాలిమిఁ బూని చాలకాలమైనది. నీ సహాయ ముండియు లాభము లేకపోయినది.

కృష్ణు:—అర్జునునకు నాసహాయమున్న నేమి లేకున్న నేమి !

సీ. కాలకేయాదిరాక్షసులతోఁ బోరాడి
కూల్చినాఁడీతఁడో క్రూరుఁడుగాఁడె
శస్త్రాస్త్రములఁదాల్చి సంసప్తకులఁదాకి
కసిమసంగె నితఁడో క్రూరుఁడుగాఁడె
మించి భర్గుని మోహరించి పాశుపతాఖ్య
కాండంబుఁగొనియె నో క్రూరుఁడుగాఁడె
అంగారపర్ణుని సంగరస్థలిఁబెట్టి
పరిభవించె నితఁడో క్రూరుఁడుగాఁడె

గీ. నరుఁడు వైరిచమూప్రాణ హరుఁడు విజిత
హరుఁడు గాండీవ కార్ముకధరుఁడు పరశి
రః కిరీట విరాజచ్ఛ రణుఁడు ఘనుఁడు
కర్ణుఁడనినఁ గిర్ణుఁడనిన లక్ష్యంబెచెప్పుమ.

అర్జు:—అన్నయ్యా! గతించినదానికి విచారించిన లాభమేమున్నది. నీ సేమంబరయవచ్చిన మమ్ము శీఘ్రమ్ముగఁబనుపుము అటుపై నీవెట్టివార్త వినెదవో నేఁజెప్పనేల!

చ. పులిఁగనిపాఱుజింకలన భూపతులెల్లను విచ్చిపాఱ ను
జ్జ్వలతరతీవ్రబాణముల వైరులనెల్లఁబ్రదుంచి యాశవం
బుల మృగయూథపక్షికుల ముల్ తినుచుండఁగఁ జూచియేచి నా
బలమును నీ కుఁదెల్పఁగనువచ్చెద నిచ్చెద భూరిరాజ్యమున్.

కృష్ణు:—ఇంకసందేహింపఁ బనిలేదు.

ఉ. రాజు, సుధీజనాబ్జ దినరాజుఁగృపారసపూరితాననాం
భోజు, నిజాశ్రితాళిసుర భూజుఁ, దృణీకృతశత్రువాహినీ
రాజు, ముఖప్రకాశజిత రాజుఁగృతాంతతనూజు, విస్ఫుర
త్తేజు, వధింపగాఁదలఁచు ధీరునిఁగ్రీడి వధింప కుందునే?

ధర్మ:—(తనలో) ఇఁక శాంతించెదగాక (ప్రకాశముగ)
కృష్ణా! ఆపద్బాంధవా!

ఉ. ఈరసమూని ఖ్యాతిఁగల యొంతటి వీరవరేణ్యులైన నీ
పోరితమందుఁగర్ణుఁబిఱు వోవకమార్కొనలేరు; దైత్యసం
హారుఁడవీవటంచు మది నారసి తమ్మునిఁ బంపుచుంటి; నీ
భారముచూవె పార్థునకపాయము బాపి విజయంబుఁగూర్పుమీ.

కృష్ణు:—రాజా! నీవు నొక్కిచెప్పవలెనా! నాసహాయముతో నే
మున్నది. నీధర్మమే, నిన్ను రక్షింపఁగలదు.

ఉ. అక్రమరాజ లోకమహా హాయన, దిక్కులుసంచలింప, భూ
చక్రము తల్లడిల్లఁగురుచక్రము భీతిలివెన్నుసూపఁ దో
ర్విక్రమకేళి లోనఁబృథివీ ధరవైరి తనూభవుండు ని
ర్వక్రితవైరులన్దునిమి వచ్చును ధర్మమె యూతకోలగాన్.

## కర్ణవిక్రమము.

ధర్మ:—(సంతోషముతో) అర్జునా? మున్ను నీవుచూపినవిక్రమము సంస్తవనీయముగానేరదు. కర్ణునిఁదునుముదువేని, శర్వుచే మెప్పుఁజెందిన నీ యశస్సు శోభిల్లును.

సీ. జంభారిచేఁబూను దంభోళి నింబోలి
రిపుపర్వతముల హ రింపవలయు
సప్తార్చితీవ్రతే జంబునువెలిబుచ్చి
మార్తురన్ మ్రాకులన్ మాడ్పవలయు
నతిభీకరంబైన యమునిదండముభంగి
శత్రుపాపాత్ములఁ జంపవలయు
మధ్యాహ్న భీషణ మార్తాండునివిధాన
కురురాజు తేజంబుఁ గూల్పవలయు

గీ. గెలుపులిచ్చినిఁజేఁబట్టి కెరలవలయుఁ,
గినిసి పరచమూలోకమునన్ దునుమవలయు;
మించి నాడు భూతేశు మెప్పించి నట్టి
చాపరోప ప్రతాపముల్ చూప వలయు.

అర్జు:—అన్నయ్యా! ఇకవిళంబ మెందులకు.

మ. కరయుగ్మంబునఁ గ్రాలు సూతసుతువిల్ ఖండించి గాండీవని
ష్ఠురచాప ప్రవిముక్త భీకర శర స్తోమంబునన్; నాదు మ
చ్చరమున్ జూపివడిన్ వియచ్చరులుమె చ్చన్ బైకి లంఘించి త
చ్ఛిరమున్ ద్రవక్కలఁజేసి, వచ్ఛేదభవచ్చిత్తంబు పొంగారగన్.

ధర్మ:— అర్జునా! ఈకార్యము నీకలంతియని యెఱుంగుదును అందులకు సందియము లేదు.

గీ. పశుపతిని గెల్చి ప్రీతిభక్తుఁడై పాశుపతముఁ
గొన్నవాఁడవు కర్ణునిఁ గూల్పలేవె ?
వాసుదేవునిమహిమంబు వ్యర్థమగునె ?
విజయునకు విజయంబు లభింపకున్నె ?

కృష్ణా! యుద్ధమునకు నేఁ గడంగుటకుఁ గారణమీవె యగుదువు.

ఉ. సంధియొనర్ప నెంచి నిను శాంతవచనంబులఁ బంపినాఁడ క
ర్వాంధులు కౌరవాధములు హానిఘటింపఁదలంచి మించి యీ
రంధిని బెట్టి చాలక పరాభవమున్ దగఁ జేసిరో జగ
ద్బాంధవ! నీబలంబునఁగదా యల దాయల మోహరించితిన్

పాండవాభిమానముఁగల నీకధికము చెప్పనవసరము లేదు. అట్లయ్యు నీచిన్నవిన్నపమాలకించి ననుఁగృతార్థునిఁ జేయుము.

ఉ. సంజయు రాయబారపుఁబ్రసంగము సర్వము నీసమక్షమం
దుంజరిగెంగదా! రిపుల తోడఁ బెనంగొన నెంచి యాప్తులన్
భంజనమున్ బొనర్పఁ జలపట్టితి నాపయి నీకుఁ గూర్మియున్
రంజన లేకపోయిన నిరంజన! యయ్యది నా యభాగ్యమే.

కృష్ణు:—(ధర్మరాజు హస్తంబుల రెంటిఁబట్టి) మహానుభావా! నన్నుఁగరుణింపుము. తప్పులు నాయవిగా భావింపుము. నీకుఁ

దప్పక మేలుచేయఁగలను. మాకాజ్ఞ నొసంగుము.
అర్జునా. పోవుదమురమ్ము.

అర్జు:—అన్నయ్యా! నీవాక్కులమోఘంబు లగుఁగాక.

(కృష్ణార్జునులు నిష్క్రమింతురు.)

ధర్మ:—నాయదృష్టమెట్లున్నదో యట్లగును. కృష్ణుఁడుగలఁడు గదాయను ధైర్యమొండు గలదు. ఇందులకుఁదోడు భూసుర శాపమొండుగలదు! కర్ణుండుచచ్చునను నాసయుఁగలదు.

చ. అలజడిఁజెందిస్రుక్కి—తి; జ యాపజయంబుల నిర్ణయింపనా
కలవియె ? నాదుడెందమడి యాసఁబెనంగుచునుండెఁ గీడువా
టిలునొ? యెవండెఱుంగు మును డీకొనిపోరుట రాచపాడి? త
త్ఫలితము నిశ్చయింపఁగల భారమదృష్టముఁబూనియుండుఁబో

అయినను నీవిషయమిట్లు నిశ్చయింపవచ్చు.

గీ. దుస్ససేనుని భీముండు దుంచుకతన
భూసురుని శాపకారణం బునుమఱియు
మద్రనాథునిసారథ్య మహిమవలనఁ
కర్ణుఁడుత్సాహముందక్కి— కలనఁజచ్చు.

(అని ధర్మరాజు నిష్క్రమించును.)



# పంచమాంకము.

రంగము:— కురుక్షేత్రము.

దృష్టద్యు:—(అధికసంరంభమునఁ బ్రవేశించి)

గీ. శింజినీ నినాదంబునఁ జెవ్రదుపఱచి
కఠినభల్లంబులను మేనఁ గదియఁగ్రుచ్చి
బెగడియెచ్చోట డాగెను భీముఁడనుచుఁ
జెందుచున్నాఁడు కర్ణుండు జెలగినేడు.

కృష్ణుఁ డెంతటిచమత్కారముఁ జూపించెను. శౌరిపౌరి యర్జునుండలసియుండుటచేఁ గర్ణుఁదాకననుఁ బురికొలిపి రథముఁ దొలంగించెను. ఇఁకకర్ణుని పరాక్రమముఁ జూచి యానందింప వలసినదే.

మ అహహాకాంచిన నెట్టివారికిభయం బౌగా, ధనుర్జ్యాముహు
ర్ముహురుద్ధూతశరప్రకాండమున రుద్రుంబోలిచెండాడుచున్
విహరించెన్ రిపుభీకరుండయి రణ ప్రేంఖ జ్జయశ్రీ కర
గ్రహణాసక్తిని; సూతపుత్త్రుఁడుమహా కాలుండు తథ్యంబుగన్.

ఆమూర్ఖుండు వచించినపలుకులు వానిములుకులుకన్న నెక్కుడుగ బాధింపుచున్నవి.

మ పగసాధింపఁదలంచి యాహవమొ నర్పంజాలమిన్ నన్నునిన్
దగులం జేసి తొలంగిరర్జునుఁడు దైత్యధ్వంసియున్; నీకుమే
లగుఁబో! సూతుఁడు రాచబిడ్డఁడనినే నన్నట్లు శిక్షించ నీ
భగినింజూచివచించిరమ్మనుచు సం భాషించె నీర్ష్యాళువై.

నేఁడు కర్ణునితోఁ బోరఁదగు వీరుఁడెవ్వఁడు గనుపట్టకున్నాడు. ఇఁకయుద్ధముతో నేమిలాభము. (అంత తెరవైపుఁజూచి)

చ. పరిచయము సంఘటిల్లె సుర రాజతనూభవ! మృత్యుసర్పదం
ష్ట్రలవలెనుండెభల్లనికరంబులు పావని! శూలి శూలధా
రలపోలుపొందెఁ జూడ్కి యమ రాజతనూభవ! ప్రాణముండినన్
గలిమియునుండుఁ బాలుఁడిఁక కర్ణుఁడురుద్రుఁడో వీరభద్రుఁడో.

(కర్ణుఁడాకస్మికముగఁ బ్రవేశించి విల్లెక్కువెట్టి దృష్టద్యుమ్నుఁగాంచి)

చ. పలుచెదవేని బాణమునఁ బ్రాణముఁగొందు దురాత్మ! నీదు సో
దరిమగఁడెవ్వఁడోపు ననుఁదాఁకఁగఁ జాలునె శూలియైన; సం
గరమునపుత్రుఁడీల్గెనని గాసిలి మూర్ఛనుబొందియున్న భూ
సురునివధించునీవు నొక శూరుఁడవే విలుబూనినిల్వఁగన్.

దృష్ట:—పరుగిడిపోవుటకుఁ బందననుకొంటివా యేమి! రాచకొలంబున జనించిన రాచబిడ్డనుగాని సూతుఁడఁగాను.

కర్ణ:—ఓయీ! ఈపలుకులు నీ సోదరి నేర్పెనా యేమి! ఈ బింకముల బలుకుల మాకు నైజముగాఁబోలు. నాడునీసోదరియు నిట్టిబింకములనే పలికెను.

మ. నను వీక్షించి నృపోత్తముల్ నగులుజెందన్ మత్స్యయంత్రంబు ఖం
డనమున్ జేయుటకేఁ, క్షీరహితయై నాముందఱన్ సూతపు
త్రునిఁబెండ్లాడను రాచబిడ్డనని ముద్దుల్ గుల్కఁ బల్కంగదా!
మనుజాధీశుల దోర్బలంబుల గ్రహింపన్ శక్యమే యాపెకున్.

దృష్ట:—ఔనౌను. నీవు పలికినది లెస్సగనున్నది.

గీ. మనుజనాథుల దోస్సార మహిమ లెన్న
నెలఁతలసమర్థ లన్నచో నిక్కవంబ
సూతకులజుండు పోరుటఁ జూడమొందు
రాచబిడ్డకుఁదగును నా రాచకేళి.

కర్ణు:—ఓరీ! క్షత్రియకులకళంకా? రాచబిడ్డలమని గర్వించిన లాభమేమి. మీపొగరుఁబోతుఁదన ముణంగకున్నదేమి?

గీ. క్షాత్రకులము సర్వంబు నా శనముఁజెందఁ
గంకణముఁగట్టుకొన్న భార్గవుని కూర్మి
శిష్యుఁడన్ గర్ణుడన్ నాకుఁ జెల్లదొక్క
పోరితము నందువైరుల పొగరణంప.

ఇంతియగాక భార్గవుని శిష్యుఁడనగుటచే క్షాత్రమర్యాద నేవగించి పరిత్యజించితిని.

ఉ. సంగరరంగదేవికిఁ బ్రిజావితతిన్ బలియిచ్చియక్కటా
యెంగిలిఁబోలునేలకయి యెల్లవిధంబుల హింసఁజేసి యు
ప్పొంగుచు నంతరంగమున భూపులభంగిమెలంగలేక యి
య్యంగవిభుండొకండొసఁగె న్యాయ్యగతిన్ బ్రజ కంగదేశమున్.

ఉ. చోరులవైఖరిన్ బ్రజల సొత్తుహరించుచు నాయుధంబులన్
వారల నొపణంచి ప్రభువర్యులమంచు నరాతివీర సం
హారులమంచు క్షత్రియుల మంచు భయంకరయుద్ధరంగ దు
ర్వారులమంచుఁ జెప్పుకొను వారికి జాతియు నీతియున్నదే ?

దృష్ట:— భార్గవుని శిష్యుఁడనని గర్వించిన ఘనతయేమున్నది. అతని బలము క్షీణించెఁగదా !

గీ. రాఘవేంద్రుని నిశితనారాచములకుఁ
గండక్రొవ్వాక స్రుక్కె భార్గవుఁడపుడె !
అంతయేటికి మొన్న ప్రత్యక్షముగను
భీష్ముఁడోడింపలేదొ ? దోర్విక్రమమున

కర్ణ:— అధికప్రసంగము జేయకుము. పెద్దల నిరసింపకుము. ఇపుడు నిన్ను విడుచుటకుఁ గారణమెఱుఁగుదువా ?

ఉ. ఏ తలిరాకుబోఁణి, ధరణీంద్రులముందట సూతవంశ సం
జాతుని పెండ్లియాడనని పూత్రము వెల్లడిఁ జేసెఁ గొల్వులో;
ఆతరుణీశిరోమణికి నంగవిభుండెవఁడో వచింపఁ ద
త్ఖ్యాతియు నీతియున్ దెలుపఁ గా వినుమీకభయంబొసంగితిన్.

దృష్ట:— నేటికి మహావీరుండవైతివి.

కర్ణ:— ఓరీ క్షత్రియాధమా! మాఱుమాటాడకపొమ్ము.

కం. విడిచితిఁ గరుణించితిఁ గ
చ్చడితోఁ గలచొప్పు చెప్పి వానిన్ వెన్నున్
నడివెన్నాసగఁ దెమ్మి
ప్పుడు చూపెద మగబిరుదును పోటుఁదనంబున్.

ఉ. చొచ్చినచోనఁ జొత్తు మధుసూదనుఁడంకిలి సేయుఁగాక, వి
వ్వచ్చునిఁ ద్రుంతు నమ్ముమొనల వాలువహించి త్రినేత్రుఁడాజికిన్

వచ్చెనజాకుఁడక్కజిత బాణపరంపరఁ గృష్ణుఁ డెంతు; నన్
మెచ్చె, యరాతివీరు లవనీపతులున్ గొనియాడు వైఖరిన్.

దృష్ట:— ( తనలో ) నీగర్వమట్లున్నది. ( అని విచారింపుచు నిష్క్రమించును. )

కర్ణ:—ఇప్పటికి సర్వవిధముల యుద్ధము నా కనుకూలముగనున్నది. మున్నెట్టికిఁడరానున్నదియుఁ దెలియదుగదా? అర్జునుని గెలుచుట నాకుసాధ్యముగునని కొండంత ధైర్యమున్నది గాని కృష్ణుఁడెట్టి మాయోపాయములఁ గావించునో యని డెందము సంశయించుచున్నది. కృష్ణుఁడు మా యెడఁ బన్నుఁ గాక నా కుఁగలభయమేమి. ... ... ... ...

నేడు శ్రీకృష్ణుఁడు, క్రీడి నాతోఁ బోరిపోరి యలసి యుండుటఁ గాంచి, రథముఁ దోలంగించి దృష్టద్యుమ్నుని నన్ను మార్కొనఁ జేసెను. వీఁడా నన్నుంకిలిసేయునది. నేనలసి యుండుటజేఁ గాంచి, కృష్ణుఁడర్జునునిఁ బురికొల్పుకతంబున జయము సంశయముగనున్నది. ఊఁ! ఇందులకేమి. మాకు జయము చేకూరఁగలదని నేఁదలంచితినాయేమి ?

చ. ఎఱుఁగుదుఁ బాండునందను లహీనబలాఢ్యులు; ఐకమత్యమున్
దాఱలని జోదులంపులకుఁ దోడుసహాయముఁ జేయుఁగృష్ణుఁడున్;
కురుబలమైకమత్యమునకుం గడుదవ్వగనుండు లోన మ
చ్చరమువహించు సక్కతన సైన్యవినాశన మెంచదెన్నఁడున్.

## కర్ణవిక్రమము.

అర్జునుండెచ్చటనున్నదియు దెలియకున్నది. ఎవరెటులున్నను నాకేమి? నేఁ బోరెదఁగాక, (అని తెరవైపుజూచి) ఓ పాండవ వీరులారా !

శా. చూడంజాలఁడొ నాదుపోటుఁదనమున్ శూరత్వముం దక్కి పో
రాడంజాలఁడొ? పంగువో బధిరుఁడో యంధుండొ, ద్యోవాహినీ
చూడామోఘపవిత్రపాశుపతమెచ్చోఁ జిక్కెనో స్రుక్కెనో;
ఏడీ యామగరాచబిడ్డఁడు నరుం డేచాయఁ బోంచుండెనో ?

(అని కర్ణుఁడు నిష్క్రమించును.)



---

స్థలము. కురుక్షేత్ర ప్రాంతము:—కృష్ణార్జునుల ప్రవేశము.

---

అర్జు:—కృష్ణా ! దేవతుల కరుణాకటాక్ష విశేషంబున నార్జించిన యస్త్రంబులన్నియుఁ గర్ణునిచే నిర్జింపఁబడియెఁగదా! అక్షయ తూణీరుండనగు నేనే యింత బెండుపడుచుండ వేఱొక్క యుక్కలుండీ కర్ణునిముందు నిలువఁగలఁడా ? భుజవిక్రమము క్రమక్రమముగ క్షీణించుచున్నది. ఆతఁడో, యించుకయుఁ చలింపఁడు,

చ. బెదరడు చెక్కిటన్ జెమట బిందువులూరవు తూపులేసినన్
జెదరడు చాఁడిమింగలుగు చిల్కులు నాటిన వేఁడియూర్పులన్

బాదలఁడు, తూణముందుఁగల ములుకులఁ, గైకొను వేళనైననుం
గదలఁడు? మేలుమేలవుర! కర్ణుని విక్రమ మింతయొప్పునే.

కృష్ణు:—అర్జునా! దీనికై యింతవిచారింపనేల ? సంరంభముడిగి శాంతుండవై యుద్ధమొనర్పుము.

ఉ. పర్యవసానమే సరణి భాసిలునోయను చింతఁదక్కి, లో
స్థైర్యముబాదుకొల్పి ధృతి దప్పక యాశకు లొంగకుండ నీ
కార్యము నీవొనర్పవలెఁ; గాలముఁబట్టిఫలించు; లోకమం
దార్యులు కార్యసాధకులు యత్న మొనర్పక మానరెయ్యెడన్.

అర్జు:—కృష్ణా! ఈ యవమానమెట్లుసహింపవచ్చు. దేవేంద్ర దత్తమైన కిరీటము.........

కృష్ణు:—అందులకు విచారింపనేల ? శల్యుని ధర్మమాయుని బ్రతికి నాడవు, సంతసింపుము.

అర్జు:—ఆచాయమనమున్నట్లు కర్ణుఁడెట్లుగ్రహించెను.

కృష్ణు:—చారులవలన నెఱింగి మనలఁ దార్కొనియెను.

అర్జు:—తార్కొనెఁబో. మగుడ రథముఁదొలంగించి పాఱివచ్చుట కీర్తికిఁ గళంకముకాదా!

కృష్ణు:—అర్జునా! సమరమున సమయానుకూలముగ వ్యవహరింప వలెను.

ఉ. క్రొల్పులిపోల్కి మైమఱచి రోసము పెంపునవైరియుద్ధమున్
సల్పుతఱిన్ తొలంగఁదగుఁ జాలశుభంబగు; దాకెనేని సం

కల్పము సిద్ధిఁజెందునె? న గంబులు బీటలువాఱి బ్రద్దలా
పొల్పనవెట్టఁగా ప్రెడు నభోమణిబారికి నగ్గమౌనురే ?

(అంత దృష్టద్యుమ్నుఁడధిక సంరంభమునఁ బ్రవేశించి)

జయము. జయము. కృష్ణా! జగద్బాంధవా!

కృష్ణు:—(తనలో) ముఖవైఖరిఁజూడ నుల్లాసముగఁ గన్పట్టుచున్నది.

(ప్రకాశముగ) పాండవసేనాధిపతివచ్చు కార్యమెట్టిదియో

అర్జు:—(తనలో) ఇతఁడు కర్ణునకు భీతిలివచ్చినట్లు దోచుచున్నది.

దృష్ట:—ఏమని చెప్పఁదగు. మనకు శుభకాలము సంప్రాప్తమైనది.

గీ. అడుసు మిక్కిలి పెంపొందు మడుగునందు
మదగజంబు తగుల్పడు మాడ్కినహహ
భూసురుని శాపకారణంబునను క్రుంగె
సంగరస్థలిఁ గర్ణుని స్యందనంబు.

కృష్ణు:—అట్లయినచో నీ శుభవర్తమానము పాండవాగ్రజునకుఁ దెలియఁజేయుము.

దృష్ట:—ఇప్పుడే (అని నిష్క్రమించును.)

అర్జు:—కృష్ణా! సంకల్పసిద్ధుఁడవు.

కృష్ణు:—నీవు జయేందిరను బెండ్లాడుటకు సిద్ధముగ నుండుము.

(ఆటోపమున శల్యునితోఁ గర్ణుఁడు ప్రవేశించి కిరీటిఁజూచి)

ఉ. పాఱెనిపేలరా హరుసి బల్మినడంచిన బంటుమిన్న! వి
స్తారయశోపిశాలురగు క్షత్రియులెల్ల హసింపఁజాప తూ

## కర్ణవిక్రమము.

శీరములూని భీతిలిజుణింగితివే మగవాఁడవౌర! దో
స్సారమడంగెనే శరము చాపము తూణముఁ బ్రువ్వవద్దైనే.
(అని కృష్ణుఁజూచి తిరస్కారముగ) ఓహో! శ్రీకృష్ణభగవానుఁడా!

సీ. ఎవనిప్రతాపాగ్ని కింధనమై భస్మ
మయ్యె శత్రువ్రుల శ స్త్రాస్త్రసమితి
ఎవ్వాని దోశ్శక్తి పృథ్వీశ గళరక్త
ధారల గట్టునఁ దావి తేర్చె
నెవ్వాని తురగ మత్తేభ భటపద ర
జఃపాళి నినుఁడు సంఛన్నుఁడయ్యె
నెవ్వాని హుంకార హేరాళ రవమున
బ్రహ్మాండ భాండంబు బ్రద్దలయ్యె

గీ. నెవని ధాటికి బెగ్గిలి కృష్ణుఁడనెడి
యాదవేంద్రుండు వారాశి యందుడాగె
నట్టిబలుని జరాసంధు నణచి నట్టి
కర్ణుఁడిదెవచ్చె జయలక్ష్మిఁ జైకొనంగ.

శల్యు:—కృష్ణా! నిన్నాశ్రయించిన జయలక్ష్మి మాకిపుడొసంగక తప్పదు.

కృష్ణు:—ఇంతకుపూర్వమే యర్జునుఁడుగైకొని విజయుఁడయ్యెను

కర్ణు:— (అర్జునునిజూచి) ఓహో! అర్జునా! ఈపలుకులకు గర్వింపకుము.

చ. భవుని నిరాకరింపఁగల బాహుబలుండితఁడంచు నీ తునా
ద్భవునిధనుస్సుఁద్రుంపఁబలు పల్కులనెక్కులువెట్టు నాఘటో
ద్భవుని వధింపఁజాలని కతంబున నేమియుఁ జేయనట్టి సైం
ధవునివధించు నీదు బలదర్పము లెవ్వఁడెఱుంగకుండునో.

అర్జు:—ఎవఁడెఱింగిన నెఱుంగకున్న నీవెఱుఁగుదువు.

కృష్ణ:—నిస్సందేహముగ.

కర్ణు:—అవునవును. కృష్ణా! నేనెఱుఁగుదును. నేనే యననేల లోక
మెఱుఁగును.

చ. తనదుపరాక్రమంబుఁగనఁ దాళఁజాలక జంకి బెగ్గిలన్
గనుఁగొని యుగ్రమూర్తివయి కైదువుఁబూనిన నిన్నుఁబట్టి, నీ
మనుమడఁద్రోవుమంచు బ్రతిమాలి శిఖండిని మున్ను బెట్టి,శాం
తనువధియించు కిరీడి బల దర్పము లెవ్వఁడెఱుంగకుండునో.

అర్జు:—ఓరీ రాధానందనా! నిన్ను నే గణించువాఁడఁగాను.

గీ. కాలునింబోలు వీరుల కండక్రొవ్వ
ణంచి భువినిమించి పరాక్రమించినాడ
నాదినారాయణుండు కన్నాకునాకు,
రారవధియింతుఁ గర్ణ! నీ రణము తృణము.

కర్ణు:—శ్రీకృష్ణుఁడాదినారాయణుండగును. నీవొక వీరుండవగుదువు.

శా. నానారాజ వితాన సేనలకు న న్యాయంబుగా యుద్ధసం
ధానంబున్ బొనరించి యందునొకపె ద్దంజూచి వంచించి య

వ్యాసిం(ద్రుంచి "యితండు దైత్యుఁడు మహాపాపాత్ముఁడం" చెల్లడన్
ఏనే దైత్య కులాంతకుండ నను నీ కృష్ణుండు శ్రీవిష్ణువే.
కృష్ణు:—కర్ణా! ఎందులకీ యక్కఱకురానిపలుకులు.
శల్యు:—కిరీడి ములుకులు బుద్ధిచెప్పినఁగాని యీ పలుకులు కట్టు
వడవు. అర్జునా! సిద్ధముగనున్నావా ?
అర్జు:—సూతకుల సంజాతా! ఈగాండివమెట్టిదో యెఱిఁగియు నిట్లు
పేలుచున్నావేమి ?
కర్ణు:—నీ గాండీవమెట్టిదయ్యె నాకేమి భయము.
ఉ. దండమునుం గమండలము దాలిచి చోరయతీశ్వరుండవై
కొండలనక్కి చానల తగుల్కొనిపోవు బొజుంగుమిన్న! యు
ద్దండ శరాసనాది శర తండముగైకొని వచ్చినంతనే
నిండుమగంటిమిందొలఁగి నీకు భయంపడ నీశ్వరుండనే ?
శల్యు:—కర్ణా! ఎందులకీపలుకులు. రథము కుంగెఁగదా! నామాట
వినుము. అర్జునుని శరణువేడుము.
కృష్ణు:—శరణమా ? మరణము.
అర్జు:—(ప్రోవుమనినఁ బోచువారలెవరు!
కర్ణు:—ఓహో ! యేమియీ శూరత్వము.
ఉ. భీరుఁడగాను నేనురణ వీరుఁడ, శూరుఁడ, శత్రులోక సం
హారుఁడఁ సూరిసజ్జనవిహారుఁడ, ధీరుఁడ, భూరిభీకరా
కారుఁడ, వైరిభీకరుఁడఁ గర్ణుఁడ భాస్కరతుల్యవర్ణుఁడన్
ధీరుఁడవైనచో ననువ ధింపుము నింపుము కీర్తిచంద్రికల్.
అర్జు:—సూతసుతుని వధించుట యొకకష్టమా.

కర్ణు:—ఆబింకమెట్టిదో చూచెదఁగాక శల్యా! శీఘ్రముగ వెడలి యింకొకరథముఁ గైకొనిరమ్ము.
కృష్ణు:— అట్లువలనుపడదు. శల్యా! కదలితివేని నీ కంఠముఁద్రొళ్ళి భూమిపైఁబడును.
కర్ణు:— ఛీ! ఛీ! కృష్ణా.........
కృష్ణు:—మఱియొండు రథముఁదెచ్చుటకుఁ గాల మొసంగము.
కర్ణు:—కారణము.
అర్జు:—భర్గునిమోహరించి మించిన నా బాణములు నీ ప్రాణములకుఁ దత్తఱిల్లుటయ ముఖ్యకారణము.
కర్ణు:—ఒకరురథముపై, నొకరుక్రింద—ఇయ్యది రణధర్మమా!
కృష్ణు:—కర్ణా! ధర్మప్రసంగ మెత్తకుము.

చ. మదమున భీమునింబిలుకు మార్పఁదలంచుట మీకుధర్మమే
బెదరక ద్రౌపదిం బరిభవింపఁదలంచుట మీకు ధర్మమే
పదువురుఁగూడి యొక్క పసి పాపనుజంపుట మీకుధర్మమే
కదనమునందు నిన్గవిసి కంఠముఁద్రుంచుట మాకధర్మమే.

కర్ణు:— అట్లయిన మీరుపోరుటయు నధర్మమే.
అర్జు:—ఏమీ! మారాజ్యమునకై మేము పోరాడుటయధర్మమా !
కర్ణు:—క్రొవ్వి జూదమాడి యోడిన రాజ్యమెట్లువచ్చును ?
కృష్ణు:—రాజ్యము వీరభోజ్యమనియూహించి పోరాడుచుంటిమి.
కర్ణు:—రాజ్యము వీరభోజ్యమగుఁగాక. కాదనియనువార లెవరు ? మేలుచేయువారికిఁ గీడుచేయుట యెచ్చటిధర్మము ?

అర్జు:—ఔరా! పాపము. కౌరవులు మాకు మేలు చేయుటకొకటి పడా?
కర్ణు:—ఓరీ! కృతఘ్నా! నీవు మఱచితివి. చెప్పెదవినుము.

చ. తనయుఁడపాలుగోలుపడి తమ్ముల భార్యలనోడె ధర్మనం
దనుఁడలద్యూతమందు; ద్రుపదక్షితి నాథునిబిడ్డ కుందు కా
రణమునఁబోఁ ద్రెమిమ్ము ధృతరాష్ట్రుఁడు దాస్యమునుండి; నమ్రులై
మనుచుఁగృతజ్ఞులౌటకును మారుగ బోరుటమీకుఁబాడియే?

కృష్ణు:—ఓయీ కర్ణా! నేనొకధర్మముఁ జెప్పెదవినుము. కుటిల
చిత్తులగు కౌరవుల వధించుటరాచపాడి. నాడు ద్రౌపదిని
పరాభవించునపుడీ ధర్మమునశించెనే? వైరుల నెట్లైన
మారణమొనర్చుట మా రణధర్మము.

గీ. జలధరమునుండి తొలగు వర్షాంబుఁబోలి
ధర్మమనునది యతి పవిత్రంబయగును
అవనిఁబడు వర్షధారల యట్లు, పాప
కర్ములంజేరి ధర్మ మధర్మమయ్యె.

అర్జు:—కర్ణా! పారిపోవుటకుఁ బ్రయత్నించుచుంటివా యేమి?
శల్యు:—అర్జునా! కర్ణునిస్వభావము బాగుగ గ్రహించితివి. కర్ణా!
ప్రాణము పోయినఁబోవుఁగాక పరుగిడవలదు. వీరుఁడవని
నమ్మి నీకుసారథినైతిని. నాకుఁదలకొట్టినట్లున్నది.
కర్ణు:—అవును. రాజద్రోహులకుఁ దలకొట్టుటయే శిక్ష.
(అని యర్జునుఁజూచి) ఓరీ! గర్వాంధా! బృహన్నలా!

ఉ. స్థాణుని మెప్పుజెందిన మదంబునమిన్నును మన్నుగానవా
స్థాణువువచ్చుఁగాక నిను సంగరరంగమునందు దీర్ఘ ని
ద్రాణునిఁజేతు నా శితశరంబు భయంకరవహ్నికీలలన్
బాణముఁబూణమున్ బయిని ప్రాణములన్ దహియించు నెంతయున్

అర్జు:— ఔరా! ఏవరైన నవ్వుఁసుర నెడి సిగ్గైన లేకపోయెఁగదా ?

మ. హరిమత్సారథియంట, వానర కులాధ్యక్షుండుడాలంట, సం
గరసంక్రీడలఁగీర్తిఁగొంటినట, యీ గాండీవముంబూని, యీ
శ్వరుమెప్పించినబల్లిదుండనట, హా పాపంబు! సూతుండు నన్
బరిమార్పంగలఁడంట, ఛీహరిణమా! పంచాస్యముంగూల్చెడిన్.

కర్ణు:— అర్జునా! నీవెంతటి స్వాతిశయముఁగలవాడ వయ్యు ధర్మ
యుద్ధముననన్ను జయింపఁజాలవు. కృష్ణుని ప్రేరణమున నీవు
నన్నధర్మమునఁ జంపుదువుగాక. అయ్యాదినీవు నన్నుజయించి
నట్లుకాదు. ఇంతకు మీరధర్మయుద్ధమునకుఁ బాలుపడి
గ్రహించునది మాయుచ్ఛిష్టముగాని యొండుగాదు.

ఉ. ఇష్టమువచ్చినట్టుల న నేకవిధంబుల మేము ప్రీతి ను
త్కృష్టముగా ధరాతలము నేలిసుఖంబులఁ జెందినాము; సం
తుష్టినిమీరు చుట్టముల తోడను మేముభుజించి త్రోయును
చ్ఛిష్టపుఁగూడుమొందుగ భు ఁపుడుకృష్ణుఁడు సంతసింపగన్.
(తనలో) ఇఁక మొండిపల్కులతో నేమిఫలము ?

ఉ. ఎంతటియుద్ధభారము వ హించెనొ నాదురథంబుకుంగె, నా
పంతమణంగెఁ; గౌరవ నృపాలుని పెంపుదొలంగె; నాజి వి

క్లాంతినిపుక్కే-సేన; జయకాలము పాండవపక్షమయ్యె; న
త్యాంతముఁజెందె బల్మియు; ని రాశవహింపుటకింకశంకయే.
గీ. విధిబలీయంబు రణమున రథము కృంగె
నాగ్రహమణంగె వైరాగ్య మావహిల్లె
భారమయ్యెవహింప శరీరమెల్ల
చాఁదలంచితి నాకేల జయజిగీష.
పర్యవసానమెట్లున్నను—నావిధి నేనొనర్పకతప్పదు
ఉ. భవ్యులు పాండునందనులు పాడియెఱింగినవారు; వారిబాం
ధవ్యమునాకుభావ్యమయి నన్కురునాథునిచెల్మి కల్మిఁగ
ర్తవ్యముపోరితంబ; సమ రంబొనరించి పరాక్రమించెదన్
నవ్యయశోవిలాసమున నాకసుఖాతిశయంబు లందెదన్.
(ప్రకాశముగ) అర్జునా! జాలమెందులకు ?
ఉ. గాండివముంగలట్టి త్రిజ గన్నుతబాహుబలుండవీవు; సూ
తుండను నేను, నీకుఁగల దోర్బలసంపద తెల్లమయ్యెఁ; గో
దండివినీవు; నేనుగదఁ దాల్చితి; నిన్నుజయింతు; నాగదా
దండము కాలదండము; రథంబిలఁగ్రుంగినఁ జేవ్రుంగునే ?
నీవొకరహస్యము గ్రహింపవలసి యున్నది. దురదృష్ట
వశమున నేఁజచ్చెదంగాక. "కర్ణునిజయించితి" ననుగర్వము
నీకెంతమాత్రమువలదు. విన్నావా ?
సీ. కపటభూసురవేష గాత్రుఁడై, దేవతా
ధ్యక్షుండు నను నొంప దక్షుఁడయ్యె

ధాత్రీసురేంద్రప విత్రజిహ్వార్ధ్యభూతా
శాపంబు జ్యాముక్త రోపమయ్యె
వరములఁగాంక్షించి పాండుభూవరుమనో
హారినాయెడఁ బ్రాణహారియయ్యె
వైరియై ద్రోహియై సారథ్యము వహించి
శల్యుండు హృచ్ఛల్య తుల్యుఁడయ్యె
గీ. రథముగ్రుంగె, భవన్మనోరథము సిద్ధిఁ
జెందె; నా డెందమున ధృతి డిందె; మీకు
ముదముగూర్పఁగృష్ణుఁడు కొంత మోసపుచ్చెఁ
గాకయున్న యేపాటి నీ కండబలిమి ?

గీ. రథముగ్రుంగిన నేమి యీ యుద్ధము లేక
యున్న నేమి నా మేని దు మ్మొందుచాలు
నీకుఁబ్రక్కలో బల్లెమై నినువధింప
మల్లచఱచితి రమ్ము నీ మదమణంతు.

(అనికర్ణుండు నిర్భక్షమించును.)

కృష్ణు:— అర్జునా! వేగమే వీనిశిరముఁదునుమవలయు.

అర్జు:— కృష్ణా! ఈ రాజ్యలక్ష్మికై మగుడ నధర్మకార్యముల నెన్నిటిఁజేయవలెను. భీష్మద్రోణులఁజంపు కిల్బిషము చాలదా ?

ఉ. కేలువడంకుచుండెఁగడు; గీతల నించుక యభ్యసించి చు
ట్టాలవధించినాడ నకటా! యదిచాలదె? చాలుఁజాలు నీ

యాలము; రాజ్యవైభవ సు ఖాతిశయంబుల కాసఁజెంది, యే
లీల వధించెదన్ రధము లేక దురంబొనరించు కర్ణునిన్.

కృష్ణు:—అర్జునా! మారుమాటాడకుండ యుద్ధమంతమగుదాక నే నుడువునట్లు గావించుచుండుము. యుద్ధానంతరము సర్వము నీకు బోధించెద.

అర్జు:—నీవాజ్ఞాపింపఁగాదనియందునా? మున్ను గావించిన దోషములలో నిదియెంతటిది ?

ఉ. చిన్నటినాటినుండి ననుఁ బేరిమి మెప్పునవాదరించి, నా
యన్న, కుమార! రార! యని యాఁదటముద్దులఁగుల్కు శౌర్య సం
పన్నిధి, భీష్మునిన్ విజిత భార్గవరాముని౽ జంపినట్టి నా
కెన్నిక యున్నె కర్ణుఁడనఁ ? గృష్ణ! కడుంగడుఁదప్పుఁజేసితిన్.

ఉ. చెప్పెసమస్తవిద్యలను, శిష్యులలో ననుఁ బెద్దఁజేసె, నా
తప్పులనోర్చె, నేర్పెరణ ధర్మము మర్మము నట్టియొజ్జకున్
ముప్పుఘటిల్ల మేల్మఱచు మోఱకుఁబోలిక మిన్నకుంటి; నే
నిప్పుడు కర్ణునిందునుమ నేటికి జంకెదఁ బాపచిత్తుఁడన్.

కృష్ణు:—అర్జునా! ఈ విచారముతో నిపుడు లాభమేమి ?

గీ. పాపపుణ్యంబులెల్ల నా వలనెఱుంగ
వచ్చు; మేటిసింగంబుచేఁ బడినతఱిని
కరుణవహియించి కుందువే టరులు గలరె ?
ఎట్టిదో క్షాత్రధర్మమిా వెఱుఁగవకట.

అర్జు:—నీయాజ్ఞ నుల్లంఘించెదనా ?

## కర్ణవిక్రమము.

కృష్ణు:—శీఘ్రముగ నడువుము.

(అని యర్జునుని కరముబట్టుకొని కృష్ణుఁడు నిష్క్రమించును.)

శల్యు:—అబ్బ! ఇప్పటికి కృష్ణార్జునసంవాదము ముగిసినది. కర్ణుఁడుచచ్చుట నిశ్చయము. (అని తెర వైపుఁజూచి) ఔరా! విరథుఁడైనను కర్ణుఁడెట్లు యుద్ధముఁ జేయుచున్నాఁడు. మేలు మేలు కర్ణా!

గీ. రాజధర్మంబుఁ బాటించి రణ మొనర్చి
నిష్కళంకయశమ్మున నెగడితీవు
ద్రోహముఁదలంచి నిను నిరుత్సాహుఁ జేసి
యశముఁగాంచితి నెయ్యది యధికమగునొ?

అహాహా! మఱియేమున్నది. కర్ణునకుఁ గాలము సమీపించినది.

గీ. యమభటోదగ్ర దంష్ట్రిక యంబుఁబోలి
క్రూర బడబాగ్నికీలల కొలఁదిఁగాంచి
మించిభండనస్థలి నాక్రమించి, విజయ
కనకపుంఖాస్త్రసంఘంబు కర్ణుఁజెనకు.

ఇట్టిదారుణకార్యముఁ జూచుటకు నాకనులు గావించిన పాపమెట్టిదో?

గీ. వైరిరాజమండలకాంతి పమ్మఁజేసి
కౌరవాధీశుహృదయ పంకజము వాడ
యుఁడయి మృత్యువన్ గాఁగాహి యొడిసిపట్టఁ
గర్ణమార్తాండబింబంబు కాంతిఁదొలఁగె.

కర్ణవిక్రమము.

ఎప్పటికెయ్యది రానున్నదో యెఱుంగనేరికగును? అహాహా! చూచుచుండ దుఃఖముప్పొంగుచున్నదికదా ?

గీ. స్వభుజదర్పంబు స్వప్రతాపంబుఁదలఁచి
మనుజుఁడొనరించుఁగార్యంబు; మంచికైన
నధికుఁడననొప్పుఁ, గీడైన నల్పుఁడగును
సకలజనులు వశులుకాల చక్రమునకు

సీ. తనచాపరోపప్రతాపవహ్నికి మేరు
భూధర మపరంజి పూదెగాగ
తన శాంతవదనంబు వనజారివైఖరి
కౌరవకైరవ గణముఁబెనుప
దనదానసుగుణంబు ధరణీసురులకెల్ల
మహిఁగీర్వాణద్రుమంబుగాఁగ
దనయశఃకౌముదీ తండంబు భాస్వచ్ఛ
రచ్చంద్రికాడంబ రము నణంపఁ

గీ. ప్రాజ్యకౌరవసామ్రాజ్య వైభవమునఁ
బూర్వమండలాధిపతుల పొలుపుఁగాంచి
పాండునందనుల యదృష్ట వశమువలనఁ
గర్ణుఁడిదె పోవుచున్నాడు కాలపురికి.

(తెరలోకలకలము.)

శల్యు:—అహాహా!! ప్రమాదము సంభవింపుచున్నదే? కర్ణుఁడు నేలఁ

గూలిన కారణంబునఁగురుసైన్యము దైన్యముఁజెంది పంచ బంగాళమైనది. కర్ణునిఁజంపితినను సంతోషమున నర్జునుఁడు ధర్మరాజు పజ్జకేగుచున్నట్లున్నది. భీముఁడు కురుసైన్యములపైఁ జెలరేగుచున్నాఁడు. కృష్ణుఁడు కర్ణునిపజ్జ నిలిచియున్నట్లున్నది. ఇంక నేనాలస్యముఁ జేయఁజనదు. ఓకౌరవ యోధవరులారా!

ఉ. ఇంచుకతాల్మిఁబూనుఁడు,జ యించెద మీకు జయంబునేడుగా వించెద, నాబలంబుగని పించెద రాజునకెల్లరాజ్య మి ప్పించెద, శత్రురాజుల శ పించెద, నాజిని సింగమట్లు వ ర్తించెద, యుద్ధభారముభరించెద, భీతిఁజలింపనేటికిన్.

(అని శల్యుఁడు నిష్క్రమించును.)

—:కు రు క్షే త్ర ము.:—

(యుద్ధరంగమునఁ గర్ణుఁడు గూలి పడియుండును. కృష్ణుఁడు శల్యుఁడు నొకయోర నిలిచియుందురు.)

కర్ణు:—కృష్ణా! నీకోరిక నెరవేరినదిగదా ?

ఉ. వంచనయన్ హాలంబునకుఁ బాండుతనూభవులన్ వృషంబులన్ బూంచి, యసృగ్ఘరీసలిల ముల్ రణభూమిని జల్లి సాగు గా

వించ్చి, యరాతివీరగళ బీజములంతట నాటినాటి స్త్రాం
భించినయంత నేమనుభ వించెదవీవు కృషీవలుండవై;

కృష్ణు:—నిశ్చయమే. ఇందు నేననుభవించుటకుఁగాదు. అది యట్లుండ
నీవు నేఁజెప్పినట్లు పాండవులఁజేరియున్న—

కర్ణు:—కృష్ణా! ఆవిచారము నాకు సుంతయులేదు.

మ. జననాథుండతఁడేను సూతకుల సంజాతుండ నట్లయ్యుఁ, జే
ర్మినిరాపించి విశేషతోషమున మైత్రింజేసి, నన్ రాజుఁజే
సినదుర్యోధ్యనుఁ బాసి తమ్ములనుచున్ జింతించి యాపాండు నం
దనులంగూడుటకంటెఁజచ్చుటయె సద్ధర్మంబుగా నెంచితిన్.

మఱియు రాజ్యభోగములయం దాశక్తియు, నర్జునుఁడు
నను వధింపఁజాలునను నధైర్యము నామనంబున లేవు.

చ. కురువిభు పేరనిభ్భువి నకుంఠిత బాహుపరాక్రమోన్నతిన్
బరనృపులెల్లనోదలలు వంప ధ్రువంబుగ నేనయేలి సు
స్థిరముగ రాజ్యభోగములఁ జెందితిఁ గృష్ణ! దురంబునందు నా
దురథము క్రుంగఁగాదె ననుఁ ద్రుంచెఁగిరీటి యధర్మవైఖరిన్.

కృష్ణు:—కర్ణా! నీరథము భూమిఁగ్రుంగకున్న నర్జునుఁడు నిను
జయింపఁజాలఁడని నేనునిశ్చయముగఁ జెప్పఁగలను.

శల్యు:—నిస్సందేహముగ.

కర్ణు:—కృష్ణా! ఇపుడాపలుకులవలన నేమితృప్తియుండును ?

శా. ఘోరారణ్యముఁగాల్చి ముజ్జగము లుద్ఘోషింప, జంభారిదో
స్సారంబున్ స్వబలాతిరేకమున నిస్సారంబుఁగావించి, హాం
వీరాగ్రేసరుఁడై ధనుస్సుగొనునా వివ్వచ్చునౌద్ధత్యమున్
బీరంబున్ మదిముట్టఁజూడఁదఱి త ప్పెన్ దప్పెనిర్భాగ్యుఁడన్.

మ. నరుఁడాభీష్ముని ధాటికోడిదిగులొం దన్ గాంచిచక్రంబునన్
కరిపైసింగముమాడ్కి భీష్మునిపయిన్ లంఘించి యాటోప భీ
కరముంజూపితివీవు; నాకు రథ మొక్కండున్నఁబంచాయుధ
స్ఫురణంబున్ బ్రకటించిరుద్రునివలెన్ జూపింపవే రౌద్రమున్

కృష్ణు:—కర్ణా! ఇపుడిట్లునీవు విచారించిన లాభమేముండును. నీకు నిర్యాణకాలము సమీపించుచున్నది. కోరికలున్నఁ దెలియంజేయుము. నెరవేర్పఁబ్రయత్నించెద.

శల్యు:—దుర్యోధనుఁడు గాపాడంబడు కోరికదక్క మరియొండు కోరిక కర్ణునకేలయుండును ?

కర్ణు:—కృష్ణా! నాపయింగల యభిమానముచే నీవట్లనుచుంటివిగాని నాకుంగోరిక లేమున్నవి ? పాండవులయందుఁ గౌరవుల యందునాకు సమానభావముగలదని నీవెఱుంగుదువు. పాండవులు గెలువంజాలిరేని నాసహోదరులు రాజ్యమేలఁగలరు. కౌరవులు గెలువంజాలిరేని నన్నుఁబోషించిన దుర్యోధనుడు రాజ్యమేలగలఁడు. ఎవరైన నాకియ్యెడ మేలుగలదు.

## కర్ణవిక్రమము.

సీ. కన్యయై కడుఁ బేర్మిఁ గడుపారఁగాంచిన
కుంతి కోరినయట్టి కోర్కెఁ దీర్చి
అల్లారఁ బెంచిన తల్లిదండ్రులు సంత
సముఁ జెంద ముద్దుముచ్చటలఁ దీర్చి
కిరీడి నెదిర్చి పోరాడు నే యంచు సం
దేహించు జనుల సందియముఁ దీర్చి
పరులెల్ల దుఃఖింప నరనాథు నోనరించి
నట్టి సుయోధను నప్పుఁ దీర్చి

గీ. పాండునందనుల యదృష్ట వశమువలన
రథము భువిఁ గ్రుంగఁ దన మనో రథమణంగ
స్వాంతమునఁ జింత లేకుండ సంగరమునఁ
గూలి చానున్న వానికిఁ గోర్కెలేల ?

చ. వెరవరియైన యర్జునుఁడు వీరులకుం దలమానికంబు; మీా
దఱియేఁడుగాక సూతజుఁడ హంకృతిమై ధ్వజమెత్తి వచ్చినన్
వెఱచెడువాఁడె? యంచుఁ గురువృద్ధులు పల్కినపల్కులెల్ల బ
ల్లఱపులుగాఁగఁ బోరితిని; యాతియచాలు భుజంగభంజనా.

అయిననీవు కోరినవాఁడవగుటచే నా యభిప్రాయము దెలి పెదను. భీష్మద్రోణకర్ణుల వధించిన యధర్మమార్గమునగాక, నీవు బలరాముఁడు మధ్యవర్తులైయుండఁగా న్యాయమార్గమున భీముడు దుర్యోధనుని జయించెనేని పాండవులకు రాజ్యమిప్పింపుము.

కృష్ణు:—(మందహాసమున)నాకుసహితమట్లు గావింపవలయుననియే యున్నది.

కర్ణు:— అవును కృష్ణా! నిన్నెఱుంగుదును. (అని శల్యునిజూచి) శల్యా, నాపలుకులుగ దుర్యోధనునితో నిట్లు చెప్పుము.

గీ. కాల మనుకూలమైన భూ పాలకుండు
పౌరుషంబునఁ గార్య సా ఫల్య మొందుఁ
జవుటినేల నాటిన విత్తు చందమయ్యె
మన మహాహావ సన్నాహ మనుఁగు సఖుఁడ.

గీ. భీమునకుఁజిక్కి తమ్ముండు పెనఁగులాడఁ
బ్రోవలేకుంటి, వివ్వచ్చుఁ బోరితమున
గెలువలేకుంటి, నామైత్రి వలనఁజుదిని
వ్యర్థమయ్యె నీయత్నంబు పార్థివేంద్ర;

ఉ. కౌరవనాథ! నీకుఁగల కల్మి నశింపకయుండ నాముదో
స్సారమునన్ విరోధులను జంపి జయోందిరఁ బెండ్లియాడనేఁ
గోరితిఁబోరితిన్ దుదకుఁ గూలితివోడియుఁ గర్ణుఁడౌదలన్
భారతయుద్ధమన్న యపవాదముఁజెందితిఁ జాలకుందితిన్.

మద్రనాథా! నేఁగూలితినను వార్తవినినతక్షణమే దుర్యోధనుఁడు గాఢముగ మూర్ఛిల్లియుండనోపు. లేనియెడ నిచ్చటికి వచ్చియుండును. నీవుసత్వరముగఁబోయి దుర్యోధనునకు ధైర్యముఁ గొలిపి, సైన్యాధిపత్యము వహించి నేనులేనికొఱంతఁదీర్పుము.

## కర్ణవిక్రమము.

శల్యు:—అంగరాజా! నీవు గతించినపిమ్మట మఱేయుద్ధమేల ?

(అని శల్యుఁడు నిర్గమించును.)

కర్ణు:—కృష్ణా! ధర్మరాజు నీకొఱకుఁగాఁబోలు వచ్చుచున్నవాఁడు.

కృష్ణు:—కాదు. కాదు. నీవుగతించినవార్త వినియు నిజమో యబద్ధమో ప్రత్యక్షముగఁ జూడవచ్చుచున్నాఁడు. వైరముఁ జూపింపక ధర్మరాజు నాశీర్వదింపుము.

కర్ణు:— వైరమెందులకు. అవశ్యమట్లొనర్చెద.

ధర్మ:—(ప్రవేశించి) కృష్ణా! ఎందులకిచట వేచియుంటివి.

కృష్ణు:—కర్ణుఁడు జీవన్ముక్తిఁజెందు కాలము సమీపించుటచే వేచియుంటిని.

ధర్మ:—( కర్ణునిఁజూచి తనలో ) అబ్బ! మన్మనశ్శల్యమింతటికి నూడిపడినది.

(ప్రకాశముగ) అంగరాజా! నీవుమిక్కిలి ధన్యుఁడవు.

సీ. భార్గవరాముని పజ్జ శిష్యుండవై
యఖిలశస్త్రాస్త్రంబు లరసితీవు
కవ్వడినెదిరింపఁగల మేటియొంటరి
యంచు నెన్నఁగ ఖ్యాతిఁగాంచితీవు
భూరి శస్త్రాస్త్రనైపుణ్యంబు ప్రకటించి
పరిపాలకత్వంబుఁ బడసితీవు
ధనము తృణంబుగాఁ ద్యాగంబుగావించి
దానకర్ణుండనఁ దనరితీవు

కర్ణవిక్రమము.

గీ. ధరణిగల పేరు లెల్లరుఁ దల్లడిల్ల
స్వర్ణపుంఖానుపుంఖాస్త్ర సమితి నరులఁ
గూల్చి, సఖుని ఋణము దీర్చి గూలితీవు
అవని జన్మంబు సార్థకమయ్యెఁగాదె.

కర్ణ:—ధర్మరాజా! యెల్లరాజ్యపాలన మొకరిస్వాధీనముననుండదు గదా? మావంతయినది. ఇఁకనీవంతున్నది.

ఉ. పాడిఁదలంచి యార్యజన వర్యులప్రేముడి సంగ్రహించి, ప్రాఁ
జాడలమంచినెంచి జనసంఘముఁ జక్కగసంస్కరించి, మేల్
కీడులపాల్పుఁగాంచి పటుకీర్తివహించి, ధరిత్రి మించి, ని
న్నేడవచక్రవర్తిఁగఁ గ వీందులుమెచ్చగ రాజ్యమేలుమా.

(తనలో) దుర్యోధను నాశీర్వదింపవలసిన నేను ధర్మరాజు నాశీర్వదింపవలసి వచ్చెఁగదా? తుదకునాస్నేహము సుయోధను మోసపుచ్చినది. హాస్నేహమా!

ఉ. చంచలచిత్తునైన పరి చారికమైకనుసన్నఁగొల్వఁ గా
వించితి, దాన దానములఁ బెక్కులొనర్చి యశంబుగాంచి మె
ప్పించితిలోకమెల్ల; రిపు వీరులుభీతిలి తల్లడిల్లి మ
న్నించువిధంబుసేసితివి; నిన్నిపుడిట్లు పరిత్యజించితిన్.

(ప్రకాశముగ హీనస్వరముతో) కృష్ణా! ఆయాసముగ నున్నది.........దయయుంచుము.

# కర్ణవిక్రమము.

కృష్ణు:—కర్ణా! అర్జునుఁడు నిన్నధర్మముగఁ జంపెనని మనంబునఁ జింతిలకుము.

మ. మలమూత్రాన్వితమై నిరంతరము సంసారాబ్ధిలోఁ గ్రుంకి నె
చ్చెలులంబాయు శరీరమున్ నరుఁడు ప్రేమించెన్; నీమనవజ్రోపమో
జ్జ్వలసత్కీర్తి శరీరమున్ దనుమ గాశిక్షింపఁజేయఁ యూహింపఁ భూ
స్థలి నీజన్మము వర్ణనీయమగు నశ్రాంతంబు నిక్కంబుగన్.

కర్ణు:—(ఆయాసమభినయింపుచు) నారాయణ. నా... రా.......

(అని దీర్ఘనిశ్వాసమువిడిచి విగతజీవుండగును)

కృష్ణు:—ధర్మరాజా! నిష్కారణముగ నన్ను నర్జునుని దూషించితివి. ఇప్పుడు నీకోరిక నెరవేరినదిగదా?

ధర్మ:—కృష్ణా! కర్ణుఁడు గతించినందులకు సంతోషమునకు మాఱు దుఃఖముప్పొంగుచున్నది.

కృష్ణు:— దయార్ద్రహృదయుఁడవుగనుక—ధర్మరాజా! భారత యుద్ధము కర్ణునితోనే యంతరించినది. ఇఁకనీవు పట్టాభిషేక ప్రయత్నము—

(అంతఁదెరలో—ఓకౌరవ యోధ వరు లారా!)

ఉ. చచ్చినయంగభూవిభుని స్థానమునందుఁగొంతఁ దీర్ప నే
వచ్చితి; భీతిఁదక్కినేఁటి వాఁడిమివేఁడిమి లావు చూపి వి
వ్వచ్చునిభీమునింగవిసి వైరము తీరముగాఁగఁ బోరు డిం
పచ్చుపడంగ భూరి విజయంబు రయంబునఁ బొందుడేపునై.

కర్ణవిక్రమము.

కృష్ణు:—ధర్మరాజా ! శల్యుఁడు సైన్యాధిపత్యము వహించెను. నీవంతువచ్చినది. రథివై యుద్ధముఁజేయవలసి వచ్చును.

ధర్మ:—నీవుండగా నా కేమిభయము. సిద్ధముగనున్నాను. రమ్ము

(అని యిరువురునిష్క్రమింతురు.)

---

గద్య॥ ఇది శ్రీమద్భాగవతుల నృసింహాశర్మ విరచిత కర్ణవిక్రమమను రూపకంబున పంచమాంకము సర్వము

సంపూర్ణము.

—:శ్రీరామార్పణమస్తు:—




ద్వితీయ ముద్రణము.

శ్రీ రామ ముద్రికాలయము,

బరంపురం (గంజాం.)

I22

# ద్వితీయ ముద్రణముఁ గూర్చి

## మనవి.



బరంపురమున, విక్టోరియా ముద్రాక్షరశాలయందు ప్రథమ ముద్రణము 1917 సం॥ మున ముద్రింపఁబడినది. ప్రథమముద్రణము ప్రతులు చాలకాలము క్రిందటనే సరిపోయినను తిరుగ ముద్రించుటకు సాహసింపఁ జాలకుంటిమి—ఈనడుమ మేము ప్రచురించిన "రా య బా ర ము" మహాభారత రాజకీయవిప్లవము—పఠించి యామోదించిన వారెల్లరు "క ర్ణ వి క్ర మ" నాటకమును గోరి వ్రాసిరి. ఇపుడు ద్వితీయముద్రణము వెలువడినది అందందు కొన్నికొన్ని భాగములలో మార్పులున్నవి. రసవంతములగు పద్యములు కొన్ని చేర్పఁబడినవి. ప్రాజ్ఞులగు చదువరులు గ్రహింపఁగలరు. ఈ గ్రంథకర్తగారిచే విరచితమైన వి చి త్ర వీ ర బొ బ్బి లి లేక ప్రతిజ్ఞా విజయరామరాజీయము చక్కని ముద్రణము, ప్రచురింప ప్రయత్నించుచున్నారము.

ఇట్లు

వేగుఁజుక్క గ్రంథమాల.

# అభిప్రాయ భారము

ఆంధ్రభూమియందు శ్రీయుత ఆండ్రి వేసగిరిరావుగారు, బి. ఏ. ఇట్లువ్రాసినారు:—

"వేగుంజుక్క గ్రంథమాలలో నిది నలుబదియైదవ పుస్తకము. శ్రీయుతులు భాగవతుల నరసింహశర్మగారిచే రచియింపబడినది. భారతోద్యోగపర్వమునందలి శ్రీకృష్ణదౌత్యవృత్తాంతము ఇందువిపులముగ ప్రకరణములక్రింద విభజింపబడి వివరింపబడినది. శ్రీకృష్ణుని రాజకీయధౌరంధర్యమున కీగ్రంథవిషయము ప్రదర్శనశాల. ఇందలి భారతకాలమునాటి భారతదేశపటము, చిత్రపటములు, కౌరవవంశవృక్షము విషయవివరణమున కెంతయు నుపయోగపడుచు గ్రంథప్రయోజనమును అధికరించుచున్నవి. జాతీయములతోడను, సామెతలతోడను నిండారి ఇందలి వచనశైలి ప్రౌఢగ్రాంథికమై ఒప్పుచున్నది.

ఈ గ్రంథము నవలవలె హృదయము రంజింపజేసి, కావ్యమువలె జ్ఞానప్రదమై, నేటిరాజకీయలోకమునకు దర్పణమై తుదిముట్ట చదువనిదే విడువనీయని యత్యద్భుత సంఘటనములచే స్తంభీభూతత్వమును, దిగ్భ్రమను బొందించి తన్మయతఁగలిగించి యలరించు నూతనగ్రంథరత్నము. భారతాంతర్గత పురాతన రాజకీయకథావృత్తాంతముగలిగి శ్రీకృష్ణుని దివ్యప్రతిభావిశేషమున శోభిల్లి విశ్వరూప ప్రదర్శనమునఁ బవిత్రిత మైనది.

నేతి సుబ్బారాయశాస్త్రిగారి 'ధర్మజరాజనూయము' వలె నిదియు భారతవిషయకమగు నొక ఆంధ్రవచన ప్రౌఢకావ్యము కాగలదని మానమ్మిక. హృదకవితను, గద్యకవితను సమముగ శ్రీ శర్మగారు నడుపగలుగుటకు ఈ కావ్యము నిదర్శనమిచ్చుచున్నది. ఈ గ్రంథమునందలి నలుబదిమూడు ప్రకరణములకు శిరోభూషణములుగా వివిధగ్రంథములనుండి ఏర్చికూర్చబడిన పద్యరత్నములు శ్రీనరసింహశర్మగారు బహుగ్రంథద్రష్టలగుట రూపించుచున్నవి.

క్రౌను సైజున 800 పుటలు. వెల రు1-8-0. ఖర్చులుగాక. భాగవతుల నరసింహశర్మ